## () తొలి ప లుకు ()

శ్రీరాజేంద్రకుమార్ శర్మగారు వ్రాసిన "అపనీకమాయియా" అనే హిందీ నాటకానికి తెలుగుసేత కష్టార్జితం. ఈ నాటకంలో రమ, కాకా, రాజు. ఈ మూడు ముఖ్యపాత్రలునన్ను ఆకర్షించినవి. రమ ఆదర్శజీవితం, నిజాయితీపరుడైన కాకా జీవితం. రాజు బాలలీలలు నన్ను ఆకర్షించుటచే ఈ నాటకాన్ని అనువదించుట జరిగినది. దీనిలో స్త్రీ శక్తిస్వరూపిణి అని ఆమె తలచుకుంటే ఎన్ని కష్టాలనైన భరించి మహాకార్యాన్ని సాధించగలదని మనకుగోచరించుచున్నది. ఈ నాటకంలో రమ భర్త లంచగొండి; భోగ పురుషుడు కర్తవ్యభ్రష్టుడు. లంచం తీసుకొని అవినీతి, అక్రమమార్గాలను అవలంబించే భర్త జీవితాన్ని రమ మార్చగలిగిందంటే స్త్రీ ఎంతశక్తివంతురాలో స్పష్టమగుచున్నది. స్త్రీలో త్యాగం, ప్రేమ, భగవద్భక్తి మొదలైన సద్గుణాలు ఉన్నప్పుడే ఆమె దేనినైన సాధించగలదు. ఆశలు, కోరికలు, వ్యామోహాలు, స్వార్థం ఉన్నప్పుడు ఏమంచి పనిసాధించలేము. వాటికి అతీతంగా ఉన్నప్పుడే మంచిపనిచేయగలుగుతాం. అందుకే రమ భర్తను మంచిమార్గంలో నడిపించగలిగినది.

రెండవపాత్ర కాకా అతను సామాన్య నౌకయినప్పటికి దురాశ, ప్రలోభము, స్వార్థం మొదలైన దుర్గుణాలకు దూరంగా ఉంటాడు. మంచినిపెంచిన మహత్తరమైనవ్యక్తి. అతనిలోదైవభక్తి నీతిపరాయణత, నిస్వార్థము మొదలైన గుణాలు ప్రశంసనీయములు. అతను సత్యవాది. కర్మయోగి. నిష్కల్మషమైన హృదయముగలవాడు. ఒక్క మాటలోచెప్పాలంటే సంస్కారముగల వ్యక్తి అతని సంసార ప్రభావం వల్లనే వర్మ చెడుమార్గం నుండి తప్పుకొంటాడు. వర్మను మనిషిగా మార్చిన వ్యక్తి కాకా.

మూడవపాత్ర రాజు. రమ, వర్మల కుమారుడు. రాజులో బాలసహజ సులభమైన గుణాలు పాఠకులను మైమరపిస్తాయి. చిన్నపిల్లలు మనకంటె తెలివిగా ఉంటారు. చిన్నపిల్లలు అన్ని గ్రహిస్తుఉంటారు. మనంవారు అడిగే ప్రశ్నలకు జవాబుఇవ్వలేక విసుక్కుంటాం. మనం వారిని నిర్లక్ష్యంచేస్తూఉంటాం. వారుమన లను అనుసరిస్తారు. అందుచేతనే"యథారాజా తథాప్రజా"అన్నారు తండ్రి పెద్దలు మంచిఅలవాట్లు కలవారైతే పిల్లలుకూడ మంచి అలవాట్లు నేర్చుకొంటారు, రాజు తండ్రిచేసే పనులుచేయాలను కొంటాడు. పాపం ఆపసివాడికి మంచి చెడ్డలు తెలియవు. రాజు బాలలీలలు ఎంతో ఆనందాన్ని కలుగచేస్తాయి రాజునిచూస్తూన్న మనకు సూరదాసు వర్ణించిన కృష్ణుడు జ్ఞాపకంవస్తూఉంటాడు.

అప్నికమాయీఅనే ఈ నాటకాన్ని తెలుగులోనికి అనువదించుటకు దయతో అంగీకరించిన శ్రీ రాజేంద్రకుమార్‌శర్మగారికి కృతజ్ఞతాపూర్వక వందనములు మున్నుడి వ్రాసిఇచ్చిన గురువులైన ప్రొఫెసర్ శ్రీ కె. రాజశేషగిరిరావు యం. ఎ (తెలుగు, హిందీ, సంస్కృతం) పి. హెచ్. డి గార్కి నాటకాన్ని ముద్రణ మొదలైనవాటిని నిర్వహించిన గురువులు పూజ్యులైన తండ్రి గారైన గణపతిశాస్త్రిగార్కి, ఈ నాటకం ముద్రించడంలో సహకరించిన భర్తగారైన శ్రీ వి. యస్. మూర్తిగారికికృతజ్ఞతాపూర్వక వందనములు సమర్పించుచున్నాను. ఈ నాటకం ఆల్‌ఇండియా రేడియో (హైదరాబాద్)వారి సౌజన్యంతో 2-11-82న ప్రసారం చేయబడినది.

వేదుల కమల

## —: ము న్నుడి :—

కష్టార్జిం అనే ఈ నాటకం ప్రసిద్ధ హిందీనాటక రచయిత శ్రీ రాజేంద్రకుమారశర్మ రచించిన "అపనీకమాయీ" అనే హిందీ నాటకానికి తెలుగుసేత. ఇందులో మూడు దృశ్యాలున్నాయి. మొదటి దృశ్యం క్లబ్బుజీవితంతో ప్రారంభమవుతుంది. రెండవ దృశ్యంలోని కథఅంతా వర్మగారింట్లో జరిగే సంఘటనలపై నడుస్తుంది. ఆధునిక నాగరిక జీవితంలో తారసిల్లుతూఉండే క్లిష్ట సమస్యల యథార్థరూప మీనాటకం. నేటి జీవితంలో త్యాగం లోపించింది, భోగం పెరిగింది. సాధనకుంటువడింది. కృత్రిమ పద్ధతిపెరిగిపోయింది. కాలంలో వ్యక్తి నిజ వ్యక్తిత్వాన్ని చంపుకొంటున్నాడు, అటు సంఘంపై ఆధారపడనూ లేడు. ఇటు ఏకాకిగా జీవితం గడపనూ లేడు. నైతికస్థాయి దిగజారిపోయింది. ఆర్థిక, రాజనైతిక విషయాలు అంటు వ్యాధిగా మనుష్యులకు సోకుతున్నాయి. జీవితానికొక విలువఅంటూ లేకుండా పోయింది. ఇట్టి పరిస్థితులలో జీవితం ఒక విషవలయంగా మారిపోయింది. సమస్యకు సమాధానం దొరకడంలేదు. పాతవిలువలను కాదని అంటున్నాము. కొత్తవిలువలకు స్థానంకల్పించి ప్రతిష్ఠించుకోలేక పోతున్నాము. జీవితమంతా అగమ్య గోచరంగా తయారయింది. ఇదే ఈ నాటకంలో రూపొందించిన ఇతివృత్తం. తెలుగుసేత సాఫీగానడిచింది. వ్యక్తులపేర్లు మార్చలేదు. ఓపికపట్టి నాటకాన్ని అనువదించిన శ్రీమతి వేదుల కమల ను అభినందిస్తున్నాను. రేడియోలో ఈ నాటకం ప్రసారమవడం ముదావహం. గ్రంథ రూపములో వెలువరించినందుకు అభివందనాలు.

ఆంధ్రయూనివర్సిటీ
వాల్తేరు.

కె. శేషగిరిరావు
ప్రొఫెసర్, హిందివిభాగం

# జన [illegible] రుస్తుతి

అతడు గీర్వాణ వాణి [illegible]నుగుబిడ్డ
అతడు చర్లంవశానికే [illegible]గునుగర్వ
కారణంబు గురువునా[illegible] గఱపినాడు
విద్యబాలబాలికలకు [illegible]మతోడ

జాతిపితగాంధిచూపిన [illegible]ంతిమార్గ
మందు సూత్రయజ్ఞము చే[illegible]ముందునిలచి
నావు, సర్వోదయు వి[illegible]మీవుచేయ
తిరిగినాడవు నూరూరదేశమందు

రామచరితంబు వ్రాసెను రమణతోడ
సులభశైలిలో తగ బ్రహ్మసూత్రములను
గీత నుపనిషత్తులతీర్చి కీర్తిగన్న
యతడు గణపతిశాస్త్రి మాకగునుతండ్రి

ఇన్ని చేసితివీవని యెన్నలేము
ఎన్ని చేసినగాని నీకున్నదేమి
భారమంత దైవమునకే వదలివసుధ
నీవునిష్కామ బుద్ధితో నిలచి నావు.



## —: మాతృస్మృతి :—

తల్లి ధన్యమూర్తి వీవు త్యాగనిధివమ్మ
కర్మయోగిని వీవమ్మ, కాంతలందు
సర్వసుగుణాల రాశివి, స్వార్థమెన్న
లేని నిస్స్వార్థురాలి వెల్లడసుశీల!

స్వపర భేదంబులెఱుగని సమతనీది
మాన్య చరితవు స్త్రీజాతి మణివినీవు
పాటపాడిన ఘనులైన ఘనములెత్తి
ఆటలాడెడు నీకంఠమహిమయేమొ.

కల్లకపటములెఱుగవు తెల్లనివవి
పాలనుచుజెప్పనమ్మెడి పడతివమ్మ
దానధర్మాలు నీలోన తరగకుండు
పేదసాదలపాలిటి పెన్నిధివిల

కోరిచేయవు కర్మముల్ కోర్కెతోడ
వనితలెందరొ నీవల్ల బ్రతుకుచుండ్రు
తరలిపోయిన నిన్నిటుతలచితలచి
కాంచుచున్నాము నీరూపు, కనుముమమ్మ

కన్నకడుపుపంట కొడుకు కన్నుమూయు
పోకునీవెంట నేనున్నపుణ్యగతికి
వచ్చుచున్నదానననుచు పల్కిపుత్రుని
ననుసరించిపోయితె తల్లి! నమస్సులమ్మ.

((( ¡ )))



((( ¡ )))

## .... సోదర స్మృతి ....

మాకుఏకైక భ్రాతనిర్మల హృదయుడు
మృదుమధుర గాయకుడు దయాస్పద హృదయుడు
వినయవంతుడు సార్థకవిదితనాము
డైన తమ్ముడు బుద్ధుడో అమరుడయ్యె.
భయము సంశయమ్ములులేవు భ్రాతనీకు
మనసు మెత్తన నవనీతమట్టునీకు
మాటతీయన హృదయంబు మల్లెతీరు
విద్య నీకిడె మేటిమౌ వినయమిలను
తృప్తి సర్వసంపదలకు తీరమనుచు
తలచిజీవించి నాడవు, తలచిచూడ
లేదు మోహము, కోరికల్ లేవునీకు
లేవు కామక్రోధాలేమి లేవు వ్యధలు
సత్య శివసుందరమ్ములు సతమునీదు
హృదయ పద్మాన వికసించి మెదలెనయ్య
విద్యకై జీవనమ్మును వ్రేల్చినావు
ధన్యమయ్యెను జన్మము ధరణిలోన

# పాత్రలు:-



వర్మ

రమ

చందా

కాకా

రాజు

లాలాఝింగూర్ ప్రసాదు

శేఠ్కిశోరిలాల్

చంపత్‌రాయ్

కౌంటర్ క్లర్క్

కూలివాడు



# కష్టార్జితం

## మొదటి దృశ్యం

స్థలం:— ఒక అధునాతనమైన క్లబ్
సమయం:— రాత్రి 7 గంటలు.

రంగస్థలం మధ్యలో బయటకు పోవుదారి. కుడివైపున ఒక కౌంటరు. కౌంటరులో ఒక టెలిఫోను. ఎడమవైపున ఒక సోఫా, ఒక బల్ల, కౌంటరు. కుడివైపున క్లబ్‌లోనికి పోవుటకుదారి. తలుపు తర్వాత రంగస్థలము. ముందు భాగములో రెండు కుర్చీలు. వాటి దగ్గర చిన్న స్టూలు. దానిమీద ఏష్ట్రే.

తెరఎత్తిన తర్వాత రంగస్థలం కొంచెము వెలుతురుగా ఉంటుంది. తెరవెనుక నుండి పాశ్చాత్య సంగీతం వినిపిస్తూ ఉంటుంది. వెలుతురు అంతకంతకు ఎక్కువవుతుంది. నౌకరు కాకి దుస్తులలో ఉంటాడు.

బడేమియా:— (ఒక సోఫావైపుకు వెళ్ళి) నమస్కారం. అయ్యగారూ! బీదవాడిని మీ ఆశీర్వాదం కావాలి. తమ దర్శనం చాలా కాలానికి అయింది. మీకు చల్లని పానీయం తేనా, లేక వేడి పానీయం తేనా? ఇప్పుడే తెస్తాను. (రెండవకుర్చీ వద్దకువెళ్ళి) దండాలండి బాబూ! నిన్న అమ్మ

గారు రాలేదు. బహుశ ఈ రోజు రావచ్చు. నేను తప్పని సరిగ చెపుతాను. మీకేమి తెమ్మంటారు? (హఠాత్తుగా వెను కకుతిరిగి) నమస్కారమండి! అమ్మగారు! రండి అమ్మగారు (ఒక కుర్చీని తుడుస్తూ) ఇక్కడికి దయుచేయుండి. చంపత రాయ్‌గారైతే రెండు-మూడు రోజులనుంచి కనుపించటం లేదు. వస్తే చెపుతాను. (ఎవరో పిలిచినట్లుగా హఠాత్తుగా. రెండోపైపుకితిరిగి) వస్తున్నానండీ! చాల మంచిపండయ్యా (మరొక కుర్చీవద్దకువెళ్ళి) మేనేజరుగారూ! నమస్కార మండి. పేపర్లో తమ వేటఫోటో చూశాను. మీరు సింహాన్ని ఎంతబాగా చంపారయ్యా! అయ్యో! ఆ అమ్మగారైతే (సిగ్గుపడి) కర్నల్ సాహబ్‌తో వెళ్ళింది. (హఠాత్తుగా ఆగి) చుట్టన్! ఒరే! అక్కడ నిలబడి ఏంచూస్తున్నావ్! ఇదంతా నీకోసమే చేస్తున్నాను. (చుట్టన్ ప్రవేశించును) (చుట్టన్‌వి కూడ కాకిదుస్తులే)

చుట్టన్:— బడేమియు! నాకు గురుపై పోయూవే!

బడేమియు:— ఒక గ్లాసుమంచి నీళ్ళు తీసుకురా?

చుట్టన్: మంచిది గురూ.

బడేమియు:— సరే. ఇప్పుడు, మంచినీళ్ళు ఎలాతెస్తావో! (చుట్టన్ కొంతదూరం వెళ్ళి ఒక ఖాళీగ్లాసు తెస్తాడు)

బడేమియు:— ఒరే! నీవు వట్టి చవటవులా నడుస్తున్నావు.

చుట్టన్:— నువ్వే చెప్పావుగా! అలానడవ మనీ.

బడేమియు:— నేను చెప్పింది, తీవిగా నడవమని. తీవిగా నడవ మంటే హుషారుగా నడవాలి. సరే మళ్ళీనడుచూస్తా. (చుట్టన్ మళ్ళీవెళ్ళి నిరాశగా వస్తాడు) ఆముదం త్రాగిన వాడలా మొహం పెడతావేం! (కొంచెం చిరునవ్వుతో) ఊ! బల్లమీద పెట్టు. రాత్రి ఏదో హడావిడిచేస్తున్నట్లున్నావే! నువ్వు.

చుట్టన్:— ఒక అమ్మగారు నన్ను "సాస్" తెమ్మని చెప్పారు. నేను "అత్తగార్ని ఎక్కడనుండి తేవాలా!" అని తికమక పడ్డాను. కొంత సేపటికి మళ్ళీ "సాస్తే" అని అరిచారు. నేను వినయంగా నమస్కారంచేసి, "అయ్యా! నాకింకా పెండ్లి కాలేదు. అత్తనిఎక్కడనుండి తేను" అని అన్నాను. తర్వాత తెలిసింది పచ్చడిని "సాస్" అంటారని. పచ్చడిని సాస్ అంటే పరవాలేదు. కాని అత్తని పచ్చడి అంటే ఏమవు తుందో!

బడేమియు:— ఇంకే మవుతుందిరా? అలా అన్నవాడ్నిపచ్చడి చేస్తారు.

చుట్టన్:— సరేకాని బడేమియా! "మామా" అంటే అర్ధమేమిటి?

బడేమియు:— ఇక్కడ నిన్ను ఎవరు చేర్చారో! కాని వెర్రి మొహం లాగున్నావు. ఎప్పుడైనా నీ వంశంలో ఇటువంటి పని ఎవరైనా చేసారా?

చుటన్:— గుహూ! మా వంశంలో చెవిటివాడు, మూగవాడు లేడు.

బడేమియు!— అందరూ నీలాగే మొద్దులాగ ఉంటారను కున్నావా! ఇక్కడ నీ కెవరు ఉద్యోగ మిప్పించారు?

చుట్టన్:— మేనేజరుగారి తోటమాలి. మా ఊరు వాడిది. వాడే మేనేజరుగారితో చెప్పాడు.

బడేమియ:— ఈరోజుల్లో ఏపనికైనా సిఫారసుకావాలి. ఈ సిఫారసే నీకీ ఉద్యోగ మిప్పించింది.

చుట్టన్:— ఇంకనాకు నువ్వే గురువువు. నీవుచెపినట్లుచేస్తా, ఇక్కడ పద్ధతులు నేర్పుగురూ? రెండు రోజుల్లో.

బడేమియ:— (నవ్వుతూ) రెండుల్లోనే? ఇదిచాలాకష్టమైన పని. మేము మూడు తరాల నుండి ఈ పనిచేస్తున్నాము. మాతాత లక్నోలో నవాబుదగ్గర పెద్ద వంటవాడు. నవాబ్‌సాహబు కనీసం పదమూడు రకముల పలావులు చేయించేవాడు.

చుట్టన్:— అబ్బా! పదమూడు రకాల పలావులే! నవాబ్‌సాహబు అదంతా ఎలాతినేవాడూ?

బడేమియ:— నువ్వువట్టి మూర్ఖుడవు. నవాబ్‌సాహబు అంతాతినడు ఊరికేవాసనచూస్తూ ఉంటాడు. మాతాత నవాబు ముక్కు చూసి ఆయన ఏరకమైన పలావు వాసన చూడాలనుకుంటు న్నాడో తెలుసుకునేవాడు.

చుట్టన్: నిజంగానా ?

మియ : నిజంకాక అబద్ధమనుకున్నావా? - నీవయస్సెంత?

చుట్టన్ : ఇరవైయ్యేళ్ళు

బడేమియ ; నేను నువ్వు పుట్టక మునుపు ఐదు ఏళ్ళ నుండి పని చేస్తున్నాను. నేను ప్రతీవాని వాలకాన్ని బట్టి యీ క్లబ్‌కి ఎందుకు వస్తారో చెప్పగలను.

చుట్టన్ : వాళ్ళు ఇక్కడికి తినడాన్కి, తాగడాన్కి, షికారు చేయుడాన్కి వస్తారు.

బడేమియ : ఇంకా వాళ్ళు ఎన్నోన్నో వ్యవహారాలకి వస్తారు. ఒకరు యివ్వడాన్కి వస్తే, ఇంకొకరు తీసుకోవడాన్కి వస్తారు. ఒకరు వ్యాపారం చేయడానికి వస్తారు. ఒకరు అమ్మాయిల కోసం, మరొకరు అబ్బాయిల కోసం. ఒకరు లంచం యివ్వడానికి, మరొకరు తీసుకుందికి. ఒకరు మోసగించడాన్కి వేరొకరు మోస పోవడానికి వస్తారు.

చుట్టన్ : భలే గురువు వయ్యా!

బడేమియా : చూస్తూవుండు. యిప్పుడేం ఉంది నీవు వచ్చి వారమేగదా అయింది.

బడేమియా : బడేమియా! రాత్రి ఒక అమ్మాయి వచ్చింది. ఆమె పంట్లాం వేసుకుంది. సిగరెట్లు త్రాగుతోంది. ఆమెను చూచి నిజంగా మగవాడని అనుకున్నా.

బడేమియ ; ఇది విచిత్ర ప్రపంచము, ఇక్కడ కొందరు లిప్ స్టిక్ వేసుకుంటారు. కొందరు ఆడవాళ్ళు సిగరెట్లు కాలుస్తారు.

చుట్టన్ : బడేమియా! నువ్వు చాలా అనుభవంగల గురువ్వి. అయినా నిన్న నువ్వుకూడా ఆవ్యక్తిని ఆడదో, మగాడో గుర్తించలేకపోయావు. అందుకే ఆవ్యక్తి ఆడో! మగో! అయి ఉండొచ్చని అన్నావు.

బడేమియ ; నీవు వట్టి చవటవురా. ఇక్కడ మగవాళ్ళని సాహబ్ అంటారు. స్త్రీని సాహెబా అంటారు.
(టెలిఫోన్ గంట మ్రోగుతుంది. చుట్టన్ పరుగెత్తుకొని తలక్రిందుగా పట్టుకుంటు, టెలిపోన్ చేసేవారితో గట్టిగా చుట్టన్, చుట్టన్ అని అరుస్తాడు)

బడేమియా : ఓరి చవటా! (చుట్టన్ చేతి నుండి రిసీవరు తీసుకుంటాడు) నమస్కార మండయ్యా, అవునండి, ఇపుడెవరూ రాలేదు, సరే మంచిది (రిసీవరు పెట్టేస్తాడు) టెలిఫోన్‌లో శెట్టిగామాట్లాడకూడదు,

చుట్టన్ ; అలాగే బడేమియా! నీవు బిల్లు యిచ్చిన తర్వాత కొందరికి సమస్కారంచేస్తావు? కొందకి నమస్కారం చెయ్యవు. సౌ క్రిదేమిటో అర్ధం కావడంలేచు. నాకు అర్ధం కావటం లేదు

బడేమియు : పావలాకన్న ఎక్కువ ఇచ్చేవారికి నమస్కారం, చేయాలి, అంత కన్నా తక్కువ ఇస్తే నమస్కారం చెయ్యక్కరలేదు.

చుట్టన్ : గురూ! బిల్లు కాకుండ ఇచ్చేపై సలిని టీప్పు అంటారా? టీప్పు కాదు టిప్పు. ఆ డబ్బు మనకే వస్తుంది గదూ!

బడేమియ : టిప్ అంటే బహుమతిరా! కాని ఇప్పుడు టిప్ యిచ్చే రోజులు కాదురా ! ఆ రోజులు పోయాయి, ఇపుడు టిప్పులేదు, గిప్పులేదూ, ఆ రోజులలో మాకు పదేసి రూపాయలు వచ్చేవి,

చుట్టన్ : అబ్బ ! పది రూపాయలే ?

బడేమయా : ఆ, అవును నేను చెప్తావిను అడబ్బు ఎలావస్తుందో చెప్పనా ! మగవాడు ఒంటరిగా వస్తే ఎక్కువ డబ్బు యిస్తాడు, భార్యతో వస్తే తక్కువ టిప్పు యిస్తాడు. ఒకవేళ భార్యబిల్లు చెల్లిస్తే టిప్పు చాలా తక్కువ యిస్తుంది మగవాడు ( వాడే ) భార్యతో కాకుండా ప్రేయసితో టిప్పుచాలా ఎక్కువ దొరకుతుంది.

చుట్టన్ :- కాని వానితోవచ్చే స్త్రీ భార్యో, ప్రేయసో నీకెలా తెలుస్తుంది ?

బడేమియ :- అదంతా అనుభవంమీద తెలుస్తుందిలే! ఆ వ్యక్తి ఆమెతో ప్రేమగా మాట్లాడి ప్రేమతో ఆమెకేసి చూస్తూ వుంటేఆమె భార్యకాదనుకో.
(కౌంటర్ క్లర్కు ప్రవేశిస్తాడు)

క్లర్కు :- ఏం చేస్తున్నారు మీరిద్దరూ ?

బడేమియా :- చుట్టన్‌కి ట్రైనింగు యిస్తున్నాను. (కౌంటర్ క్లర్కు కౌంటరుపై కూర్చుంటాడు. ఇంతలో కిశోర్‌లాల్ శెట్టి వస్తాడు) నమస్కారమండి అయ్యగారూ.

కిశోర్‌లాల్ :- సలామ్. ఏమిటో భలే హుషారుగా ఉన్నావే!

బడేమియ :- అవునండి.

కిశోర్‌లాల్ :- వర్మగారు ఈమధ్య క్లబ్‌కి వస్తున్నారా?

బడేమియ :- రెండురోజులనుండి రావడంలేదు. (కిశోర్‌లాల్ లోపలికి వెళ్ళిపోతాడు.)

చుట్టన్ :- ఈయనెవరు?

బడేమియ :- ఈయన కిశోర్‌లాల్ శెట్టి. ఈయన ఘటికుడు. చాల గొప్ప ఆసామి. అవలిస్తే ప్రేగులు లెక్కపెడతాడు.

చుట్టన్ :- వర్మగారంటే ఎవరు?

బడేమియ :- ఇంకా నువ్వు చూడ్లేదులే. చాల పెద్ద ఆఫీసరు. ఆయన ఈ క్లబ్బుకి వచ్చినప్పటినుండి ఈ క్లబ్‌కే శోభ ఎక్కువయింది. ఆయన ఏపనయినా చేయగలడు. అన్నిటికి సమర్థుడే. గొప్పగొప్ప వ్యాపారస్తులు అతని వెంటబడతారు. కాని, ఆయన ఎక్కువగా మాట్లాడరు. ఏ ఇద్దరి ముగ్గురితోనో ఎక్కువగా మాట్లాడుతారు. అందరూ ఆయన

చుట్టూ తిరుగుతూ ఉంటారు. యిక్కడికి ఈయన చందా కోసం వస్తూఉంటారు.

చుట్టన్ :- మా ఊరిలోకూడ ఒక చందా అనే వస్తాదు ఉన్నాడు.

బడేమియా :- ఇది మహాపట్నంరా. చందా అంటే, ఒక అందమైన అమ్మాయి. ఆమెకోసమే ఆమెచుట్టూ తుమ్మెద ల్లాగా మగవాళ్ళు తిరుగుతూ ఉంటారు. ఆమె చిరునవ్వుతో ఎవరిపై పైనా చూస్తే ఆరోజు వాళ్ళు ఒక రూపాయికంటె ఎక్కువ టిప్పు యిచ్చిపోతారు.

చుట్టన్ :- నిన్న వచ్చిందామేనా ?

బడేమియ :- లేదు. రాలేదు. ఆమె వచ్చిందంటే, వర్మ మిగిలిన వాళ్ళందరువచ్చి చుట్టూ చేరతారు. చందాని వలలోవేసు కున్నానని వర్మగారు అనుకుంటారు. వర్మగార్ని వలలో వేసుకున్నానని చందా అనుకుంటుంది.

చుట్టన్ :- అలాగ ఎలా అనుకుంటారు ?

బడేమియ :- వర్మగారు పెద్ద ఆఫీసరు. బాగా చదువుకున్నవారు తాను చందాముందు ఒక ఆటబొమ్మ అయిపోతారు. ఆమె అతనిని తన యిష్టం వచ్చినట్లు తిప్పూకుంటుంది. నేనుకూడ క్రిందటిసెలలో ఒకతనికి వర్మగారి ఆఫీసులో ఫ్యూను ఉద్యోగం ఇప్పించాను నేను చందాతో చెప్పాను. ఆమె ఏమో వర్మగారితో చెప్పింది. అంతే పనయిపోయింది.

చుట్టన్ :- చందాకూడా ఒక ఆఫీసరా ?

బడేమియు :- ఆమె ఒక పెద్ద కంపెనీకి ఆఫీసరు. ఆమెకి వెయ్యి రూపాయలు జీతం.

క్లర్కు :- ఆ! అవును. ఒక వెయ్యి జీతం.

బడేమియు :- అవును వెయ్యి రూపాయలే. ఇతర ఆఫీసులనించి కంపెనీకి పని యిప్పించడమే ఆమెపని.

(వర్మ ప్రవేశిస్తాడు)

బడేమియు :- సలామండయ్యా !

వర్మ :- సలామ్.

చుట్టన్ :- అయ్యగారూ! నాసలామ్‌కూడ అందుకోండి.

వర్మ:- (కోపంగా) సలాము.

చుట్టన్:- ( కంగారుపడి ) నేను క్రొత్తగా వచ్చానండిబాబు. తోటమాలి సిఫారుసువల్ల వచ్చాను.

బడేమియు:- మీరు చాలా కాలాన్కి వచ్చారండి.

వర్మ:- అవును. నేను ఊళ్ళోలేను.

బడేమియు:- 4 రోజులనుండి దొర సానమ్మగారు కూడరావటంలేదు

వర్మ:- ఏదొరసాని?

బడేమియు:- చందా దొరసాని అండీ!

వర్మ:- ఓహో అలాగా (చుట్టన్‌తో) ఒక గ్లాసునీళ్ళు తీసుకురా!

బడేమియా:- పెళ్ళిపరుగెత్తికెళ్ళి మంచినీళ్ళు తీసుకురా. (చుట్టన్ లోపలికి వెడతాడు) అయ్యా! మీతో ఒకమనవి చేసుకోవాలి

వర్మ:- ఏమిటా మనవి?

బడేమియా:- ఒక వ్యాపారస్తుడు మిమ్మల్ని కలవాలని తహతహ లాడుతున్నాడు. వాడిపేరు గరీబుపర్వార్. ఈమధ్య అతని పరిస్థితి ఏమీబాగాలేదు. అతనిని పిలవమంటే పిలుస్తాను.

వర్మ:- వద్దులే.

బడేమియా:- మీ ఇంటికి తీసుకునిరానా?

వర్మ:- వద్దులే. నేను వ్యాపారస్తుల్ని ఇంట్లోకాని క్లబ్‌లోకాని కలుసుకోను. ఆఫీసుకి రమ్మనిచెప్పు. (వర్మలోపలికి వెళ్ళిపోతాడు దారిలో చుట్టన్ నీళ్ళుతెస్తూ కనుపిస్తాడు. వర్మ మంచినీళ్ళు తాగుతాడు. కిశోర్‌లాల్ లోపలినుండి వస్తాడు)

కిశోర్‌లాల్:- (చుట్టన్‌తో) ఒకగ్లాసు మంచినీళ్ళు తీసుకొనిరారా! (చుట్టన్ మళ్ళీ లోపలికి వెళతాడు)

బడేమియా:- అయ్యా! రెండు బస్తాల సిమెంటు కావాలి. తమరు దయ తలిస్తే నేలగచ్చు చేయించు కుంటాను.

కిశోర్‌లాల్:- దొరుకుతుందిలే!

బడేమియా:- బ్లాక్‌లోనా?

కిశోర్‌లాల్ : నీకు బ్లాకులో ఎందుకు? నీకు కావాల్సింది నేను ఇస్తానుగా.

చుట్టన్ : (మంచినీళ్లు తెస్తాడు. ఎగాదిగా చూస్తాడు.)

కిశోర్‌లాల్ : షటప్.

చుట్టన్ : ఇప్పుడే తెస్తానండీ! (కొంచెం దూరంవెళ్ళి తిరిగి వస్తాడు) అయ్యో! షటప్ వేడినీళ్ళు కావాలా చల్లని నీళ్ళు కావాలా ?

కిశోర్‌లాల్ : వట్టి మూర్ఖుడవు.

చుట్టన్ : ఏదయినా పొరపాటు జరిగితే మన్నించండి బాబూ! ఏదో సిఫారసుమీద ఉద్యోగం సంపాదించుకున్న వాడిని.

కిశోర్‌లాల్ : బడేమియా! ఒక కోకాకోలా పట్టుకురా.
(హజారీలాల్ ప్రవేశిస్తాడు)

హజారీలాల్ : ఒకటికాదు, రెండు.

కిశోర్‌లాల్ : రండి శెట్టిగారూ మీమీద ఒట్టు. మీకోసమే నిరీక్షిస్తున్నాను.

హజారీలాల్ : ఏమన్నారు? "నీమీద ఒట్టు! నీకోసం నిరీక్షిస్తున్నాననా? అయ్యో! ఈమాట ఎవరయినా ఒక లల్న అంటే బాగుండేది.

కిశోర్‌లాల్ : అంటే ఏం చేస్తారు?

హజారీలాల్ : నిజం చెప్పనా? నిజం చెప్పనా?

కిశోర్‌లాల్ : ఏదయినా చెప్పుతావా లేదా?

హజారీలాల్ : ఊరుకో మిత్రమా! పని జరగనిదాన్కి ఆలోచిస్తే లాభమేమిటి?

కిశోర్‌లాల్ : నీపని అయిందా? లేదా?

హజారీలాల్ : అయింది.

కిశోర్‌లాల్:- ఆ అడ్డుతొలగిపోయింది.

హజారీలాల్:- పచ్చకాగితాలకి ఏదీ అడ్డురాదు.

కిశోర్‌లాల్:- ఎన్ని పచ్చకాగితాలతో గాలివిసరాలి?

హజారీలాల్:- ఏదో పదిహేనో, ఇరవై యో.

కిశోర్‌లాల్:- కొందరు నిర్భయంగా లంచం తీసుకుంటారు. పట్టుబడతామేమోనని భయం కూడా ఉండదువార్కి.

హజారీలాల్:- పట్టుబడితే మాత్రం వాళ్ళకి భయమేమిటి?

కిశోర్‌లాల్:- ఏం? భయమెందుకులేదు?

హజారీలాల్:- ఇనుముని ఇనుమే తెగ్గొడుతుంది ముల్లుని ముల్లుతో తీస్తారు. లంచం తీసుకొనిపట్టుబడితే లంచమిచ్చి విడుదల పొందుతారు.

కిశోర్‌లాల్:- అవును నిజమే. పన్లుఅలాగే జరుగుతాయి. మంచిగా ఉంటే పనులు జరగవు.

హజారీలాల్:- అవును మిత్రమా! నీ టెండరు ఏమయింది?

కిశోర్‌లాల్:- దాని తేదీ పొడిగించారు.

హజారీలాల్:- అది తప్పకుండా దొరకాలి.

కిశోర్‌లాల్:- అవును దొరకవల్సిందే. కానియిప్పుడు ఇంకాలైను క్లియర్ కాలేదు.

హజారీలాల్:- ఆకుపచ్చ దీపం చూపించలేక పోయావా?

కిశోర్‌లాల్:- మిత్రమా! లాంతరు కొంచెం ఎత్తుగా ఉంది.

హజారీలాల్:- అయితే ఇంకో ఉపాయం ఆలోచించుకో,

కిశోర్‌లాల్:- అవును అదేగా చూస్తున్నాను. నేను చంపత్‌రాయ్‌ని చూస్తున్నాను.

హజారీలాల్:- ఆ! మంచిదే. ఆయన యిటువంటి పనులలో అనుభవం కలవాడు. ఆరితేరినవాడు.

కిశోర్‌లాల్:- (ఒడేమియాతో) చంపత్‌రాయ్‌గారు ఎలా ఉన్నారు? విశేషాలుఏమిటి? (చుట్టన్ కోకోకోలా తెస్తాడు)

చుట్టన్:- చాలా హుషారుగా ఉన్నారండీ, ఇప్పుడు వాడుకూడ ఆరణాలు తీసుకుంటున్నాడు.

కిశోర్‌లాల్:- ఎవరి విషయం అనుకుంటున్నావు?

చుట్టన్:- మా ఊళ్ళో చంపత్‌రాయ్ అనే మంగలి ఉన్నాడండి. వాడుకూడ యిప్పుడు క్షవరాన్కి అరణాలు తీసుకుంటున్నాడు

కిశోర్‌లాల్:- వట్టి మూర్ఖుడవు.

చుట్టన్:- క్షమించండయ్యా. నేను సిఫారసుమీద వచ్చాను. తప్పు అయిపోయింది. (టెలిఫోను గంట మ్రోగుతుంది. క్లర్క్ టెలిఫోను ఎత్తుతాడు)

క్లర్క్:- బడేమియా! వర్మగార్కి ఫోనువచ్చింది. (బడేమియు వర్మగారిని పిలవడాన్కి లోపలికివెళ్ళి తిరిగివస్తాడు.)

కిశోర్‌లాల్:- బడేమియా!

బడేమియు:- అయ్యా.

కిశోర్‌లాల్:- చంపతరాయ్ నిన్న వచ్చారా?

బడేమియు:- అవును దొరగారు వచ్చారు. రేపుకూడ వస్తామని చెప్పివెళ్ళారు. వస్తూఉంటారు. (వర్మప్రవేశించును. టెలిఫోను ఎత్తుతాడు, కిశోర్‌లాల్, హజారీలాల్‌లేచి ముందు ఎడమవైపునకు వెళ్ళి మాట్లాడుతారు.)

కిశోర్‌లాల్:- ప్రస్తుతం అతనిచేతిలో అన్నీ ఉన్నాయి.

హజారీలాల్:- అవును నాకు తెలుసు, స్నేహించేస్తే ఏమవుతుంది?

కిశోర్‌లాల్ : ఒకసారి నేను ఆఫీసులో కలుసుకున్నాను. కొంచెం మోటు మనిషి.

హజార్‌లాల్ : అయితే ఇంకేమి ! నడు నమస్కారం చేద్దాం?

కిశోర్‌లాల్ : సరే నడు (వర్మ టెలిఫోన్ పెట్టేసి లోపలికి వెడుతూ వుంటాడు.

కిశోర్‌లాల్ మరియు హజరీలాల్ : వర్మగారూ! నమస్కారమండి.

వర్మ : నమస్కారం

హజారీలాల్ ; ఏమండీ! మీ ఆరోగ్యం బాగుందా ?

వర్మ : యిది హాస్పిటలు కాదు క్లబ్ యిది. యిక్కడికి మనుష్యులు ఆరోగ్యంగా వుంటేనే వస్తారు.

హజారీలాల్ : యిది యెంతో మంచి సమయమని నావుద్దేశ్యం.

వర్మ : ముఖ్యమైన విషయము ఏమీలేదా ?

హజారీలాల్ : మీరు నన్ను ఒక వ్యవహారం గురించి ఆఫీసుకి పిలిపించారు.

వర్మ ; ఆఫీసులో విషయము ఆఫీసులోనే మాట్లాడు కోవాలి,

హజారీలాల్ ; మీరు అన్యథా తలవకండి. మీ దగ్గఱ కట్టర బేడీడు ప్రకటించారని తెలిసింది.

వర్మ : నేను క్లబ్‌లో ఆఫీసులోని రహస్య విషయాలు గురించి, చాటింపు చేయడానికి రాలేదు

కిశోర్‌లాల్ : మీకు సేవ చేయాలని వచ్చాము

వర్మ : యింకా చేతులు. కాళ్ళు బాగానే వున్నాయి. (చంపత్ రాయ్ ప్రవేశిస్తాడు అతను లోపలికి వెళ్ళబోతూ వుంటాడు) లోపలికివెళ్ళి పోతాడు

కిశోర్‌లాల్ : చంపత్‌రాయ్ గారూ! మాతో కూడా కాస్త మాట్లాడుతూండండి

చంపత్‌రాయ్ : చంపత్‌కాదు. మిష్టర్ సి. రాయ్ అని పిలవండి

హజారీలాలు : "మిష్టర్‌రాయ్" అంటేనే బాగుంది

కిశోర్‌లాలు : మీరు బెంగుళూరు వెళ్ళారని తెలిసింది

చంపత్‌రాయ్ : అవును వెళ్ళవలసి వచ్చింది. నాకు మహారాజు గారితో పూర్వం నుంచి పరిచయం ఏర్పడింది. ఎప్పుడైనా వెడితే వారం రోజులు వుంటేనేగాని రానివ్వరు.

కిశోర్‌లాల్ : ఈవర్మ చాలా గట్టివాడు.

చంపత్‌రాయ్ : అయితే ?

హజారీలాల్ : మీకు పెద్ద పెద్ద ఆఫీసర్లతో పరిచయం గదా. కాస్త మాపనిగూడ చేయించిపెట్టండి.

చంపత్‌రాయ్ : అలాగే చేయిస్తాను. కాని కొంత దక్షిణయిస్తే కాని పని జరగదు.

కిశోర్‌లాల్ : కొన్నిచోట్ల యిచ్చినా జరగదు.

చంపత్‌రాయ్ : నేను అంగీకరించను. ప్రపంచం, లొంగదీస్తే లొంగుతుంది. కొందరు ఇసుకనుండి కూడ నూనె తీస్తారు.

హజారీలాల్ : మంచిది మిత్రమా! రేపు మా యింటికి భోజనానికి రండి.

చంపత్‌రాయ్ : (డైరీచూసి) రేపు రెండు లంచ్‌పార్టీలు, రెండు టీ పార్టీలు ఉన్నాయి. మళ్ళీ యింకోరోజు చూద్దాంలే.

కిశోర్‌లాల్ ; (ఆశ్చర్యంగా) అబ్బా రెండుసార్లు లంచ్ పార్టీలే.

చంపత్‌రాయ్ : అవును. నేను నిన్న యిద్దరు ఆఫీసర్లని లంచ్‌కి పిలిచాను. ఒకర్ని 12 గంటలకి, వేరొకర్ని 2 గంటలకి. పని ఎక్కువగా వుంటే డబుల్‌షిఫ్ట్ వేయవలసి వస్తుంది.

హజారీలాల్ : వర్మగార్కి సేట్ అండ్ కంపెనీ అంటే చాలా దయ.

కిశోర్‌లాల్ : ఆయనవద్ద చందా వుంది.

చంపత్‌రాయ్ : నీవు చెప్పింది నిజమే.

కిశోర్‌లాల్ : ఆమె వర్మని తన గుప్పెట్లో పెట్టుకుంది.

చంపత్‌రాయ్ : ఆమె ఎవరినయినా తన వలలో వేసుకుంటుంది. చంద అంటే చందమామ. పెద్ద పెద్ద కళ్ళు, నర్గీసులాంటి ముక్కు, నవ్వితే మొగ్గలుకూడ సిగ్గుపడతాయి. ఆమెను ఎవరుచూస్తే వాళ్ళు ఐసయిపోతారు. ఆమె మాట్లాడేతీరు ఆమె ప్రవర్తనలను వర్ణింపనలవికాదు.

కిశోర్‌లాల్ :- (అతనిని ఆపుతూ) మీరు కవిత్వం చెప్పటం మొదలుపెట్టారే.

చంపత్‌రాయ్ :- (నవ్వి) ఆ విషయం అటువంటిది.

కిశోర్‌లాల్ :- మిత్రమా ! ఒక మాట విను. మాకు ఒక్క పని చేయించి పెట్టాలిసుమా !

చంపత్‌రాయ్ :- ఏమిటది ?

హజారీలాల్ :- మేము ఒక వ్యాపారాన్ని చేపట్టాము. కాని సమయాన్కి సామాను యివ్వలేకపోయాము. యిప్పుడు సామాను యిచ్చే తారీఖు పొడిగించాలి. ఈ పని వర్మగారి చేతుల్లో ఉంది.

చంపత్‌రాయ్ :- వర్మగారి చేతుల్లోనా ?

కిశోర్‌లాల్ :- అవునవును, వర్మగారి చేతుల్లోనే. కాస్త ఈ పని చేయించిపెట్టండి మిత్రమా !

చంపత్‌రాయ్ :- పనిమాత్రం అయిపోతుంది కాని ....

హజారీలాల్ :— ఖర్చుకి లెక్క చెయ్యవద్దు, పని జరగాలి, డబ్బుకేం ఉంది.

చంపత్‌రాయ్ :— మంచిది, మీరు లోపలికి వెళ్ళండి. వర్మగారు వస్తే ఈ విషయం మాటాడుదాం.
(కిశోర్‌లాల్, హజారీలాల్ లోపలికి వెళతారు. చంపత్‌రాయ్ టెలిఫోను డైరెక్టరీ తీస్తాడు, నెంబరు దొరకదు, రిసీవరు క్రిందపెట్టగానే వర్మ లోపలికివస్తాడు)

చంపత్‌రాయ్ :— గుడ్ ఈవినింగ్ సార్ !

వర్మ :— హలో ! మిష్టర్ రాయ్, ఏమిటి విశేషాలు ?

చంపత్‌రాయ్ :— ఏముంది ? తమ ఆశీర్వాదము కావాలి. తమ దయ మీద అంతా ఆధారపడి ఉంది.

వర్మ :— చాలు, ఇక చాలు, మంచిది. మొన్న మీ గ్రీటింగు టెలిగ్రాం అందింది. థాంక్యూ ! కానీ, మొన్న నా పుట్టిన రోజని మీకెలా తెలిసింది ? ఆశ్చర్యంగా ఉందే !

చంపత్‌రాయ్ :— అదేమంత గొప్పవిషయం కాదు.

వర్మ :— అయినప్పటికీ.

చంపత్‌రాయి :— ఒక రోజున తమ ఐడింటిటీకార్డు చూసి నోట్ చేసుకున్నాను.

వర్మ :- భలేబాగుంది, అయితేనూ.

చంపత్‌రాయి :- నేను పొమూమన్ణి కాదు, కేవాంతకుత్ణి. తీసు కోండి సిగరెట్టు.

వర్మ :- వద్దు, నేను ఇప్పుడే కాల్చాను.

చంపత్‌రాయి :- ఫరవాలేదు, కాల్చండి.

వర్మ :- ఎక్కువగా కాల్చడం మంచిది కాదు. ఇది చాలా చెడ్డ పని అంటారు. అందుచేత కాల్చిపారేద్దాం.(నవ్వుతాడు) థాంక్స్. అవునూ ! మీరు టెలిగ్రాం పాట్నానుంచి యిచ్చారా ?

చంపత్‌రాయి :- అవునండీ, మీకు సక్సేనా తెలుసు కదా ! అతను నా క్లాస్‌మేట్. ఎప్పుడు వస్తానని 6 నెలల నుండి ఉత్తరం మీద ఉత్తరం వ్రాస్తున్నాడు, నేను తప్పించుకుంటూ వచ్చాను. కాని ఆ టెలిగ్రాం చూసి వెళ్ళవలసి వచ్చింది.

వర్మ :- అలాగా !

చంపత్‌రాయి :- ఇతరులకు వాడు వజీరే కాని, మనకైతే వాడు సుధీరుడు. వాడు నన్ను రానిచ్చేవాడు కాదు, కాని రెండు నెలల్లో మళ్ళీ వస్తానని వప్పించి, వాగ్దానంచేసి వచ్చాను. మీసిగరెట్టు ఆరిపోయింది. (లైటరుతో సిగరెట్టు వెలిగిస్తాడు)

వర్మ :- మీ లైటర్ చాలా బాగుంది.

చంపత్‌రాయి:- క్రిందటి సంవత్సరం యింగ్లండు వెళ్లాను. ఒక రోజున దీనిమీద నా దృష్టి పడింది. అంతే తీసేసుకున్నాను.

మీకు తెలుసుగా, నాకు అందమైన వస్తువు లంటే ఎంతో ప్రీతని, అందమే ఆనంద మనిపించుతుంది.

వర్మ :- ఇట్ ఈజ్ వెరీ ఫైన్.

చంపత్‌రాయి :- అయితే, ఇది మీరు ఉంచుకోండి.

వర్మ :- వద్దు, వద్దు. నాకు కావాలనికాదు, ఊరికే అన్నాను.

చంపత్‌రాయ్ : మీ దృష్టి దీనిమీద పడింది. నేను మీ దృష్టిని మళ్ళించలేను అందుచేత మీరే దీనిని భద్రపరచండి.

వర్మ : ఊరికే అన్నాను కాని నాకెందుకు చంపత్‌రాయి ఇది "లవ్ ఎట్ ఫస్ట్ సైట్" విషయము. తమ వద్దే ఉంచండి నాకు కావలసినప్పుడు సిగరెట్టు కాల్చుకునేందుకు యిక్కడికే వస్తూవుంటాను, నా దగ్గఱ చాలా లైటర్లు వున్నాయి. నాకు ప్రస్తుతం ఒక టేప్ రికార్డర్ అవసరమున్నది.

చంపత్‌రాయి : మా అన్నగారి కొడుకు ఇంగ్లండులో వున్నాడు రాస్తే వాడు పంపుతాడు ఎప్పుడు మీకు సేవచేసే అదృష్టం లభిస్తుందా అని నిరీక్షిస్తూ వుంటాను (టెలిఫోను గంట మ్రోగుతుంది కౌంటర్ క్లర్క్ రిసీవర్ పైకి తీస్తాడు)

క్లర్క్ : (చంపత్‌రాయితో) మీకే ఫోన్ వచ్చిందండి (చంపత్ రాయి టెలిఫోన్ దగ్గఱకు వెడతాడు. వర్మ, చంపత్‌రాయిని లోపలికి రమ్మని సంజ్ఞ చేసి లోపలికి వెడతాడు)

చంద : (ప్రవేశించి) హలో! మిష్టర్‌రాయి

చంపత్‌రాయి : మీకు నూరేళ్ళు ఆయుస్సు

చంద : ఏమిటి నాకంత ఆయుస్సా! "ఐ యామ్ ఓన్లి ఫిఫ్టీ"

చంపత్‌రాయి : మీరు ఎప్పుడూ 16 ఏళ్ళలా వుండాలి
(యిద్దరూ నవ్వుతారు)

చుట్టన్ ; అమ్మగారూ! సలాము

చంపత్‌రాయి : అమ్మగారేమిటిరా నీకు ! అమ్మాయి గారనాలి గాని

చుట్టన్ : నేను ఈమెను గుర్తు పట్టాను లెండి

చంద : హట్. నాన్‌సెన్స్ ఏమిటిరా వాగుతున్నావు?

చుట్టన్ : అయ్యా! ఈమెను ఒకప్పుడు చూస్తే. ఆడో మగో తెలియలేదు.

చంపత్‌రాయి : వట్టి శుంఠవు

చుట్టన్ : క్షమించండయ్యా ఏదో సిఫారసు మీద వచ్చినవాడ్ని తప్పు అయిపోయింది (యిద్దరూ నవ్వుతారు)

చంద : తమరు బహుకాల దర్శనం చేసారు

చంపత్‌రాయి : ఈ వేళ ప్రొద్దుటే అమృతసర్ నుంచి వచ్చాను అక్కడ నా మిత్రుడు సైకిలు భాగాలు చేసే కార్ఖానా స్థాపించాడు కొన్ని రోజులుగా అతని మిల్లులో సమ్మె జరిగింది, టెలిగ్రాం వస్తే అక్కడకు వెళ్ళి ఒక వారం రోజులుండి సమ్మెను మాన్పించి వచ్చాను

చంద : అదేలాగా !

చంపత్‌రాయి : అదో పెద్దకథ తర్వాత చెపుతానులే, మీకు ధన్యవాదాలు చెప్పడం మర్చిపోయాను

చంద : ఏ విషయానికీ ?

చంపత్‌రాయి : కంపెనీ మీకు కొత్త కారు బహుమాన మిచ్చిందట కదా !

చంద : ఒహో! అదా నేను కంపెనీకి వచ్చినప్పటి నుంచి కంపెనీ అమ్మకం ఎక్కువైంది

చంపత్‌రాయి : ఎందుక్కాదు

చంద : ఇదంతా నా తెలివివల్లనే వచ్చింది

చంపత్‌రాయి : మీ తెలివికా లేక అందానికా ?

చంద : మీ వుద్దేశమేమిటి ? "వాట్ యు మీన్ బై దిస్"

చంపత్‌రాయి : మీ రూపం చూస్తే మీరు ఏరకం వాళ్ళో తెలిసిపోతుంది - అని నా వుద్దేశం - పబ్లిక్ రిలేషన్‌లో ఈ విషయాన్ని చాలా కౌంటు చేస్తారు

(వర్మ ప్రవేశించును )

చంద : గుడ్ ఈవినింగు, మిష్టర్ వర్మ !

వర్మ : గుడ్ యీవినింగ్

చంపత్‌రాయి : క్షమించండి

వర్మ : ఏదో హడావిడిగా వున్నారే !

చంద : అంతా బాగానే వుంది

వర్మ :- ఏమిటైంది ? 

చంద :- ఇంతవరక్కు చాలా విచారంగా ఉన్నాను.

వర్మ :- దేనికి విచారం ? 

చంద :- మిమ్మల్ని కలుసుకునేందుకే.

వర్మ :- అదేమరి. 

చంద :- అదేనా ?

వర్మ :- నేను మీకోసం పూర్తిగా 15 నిమిషాలు. అంటే గం॥ల నుండి గం॥ 3-15 ని॥ల వరకు మానకుండా టెలిఫోను త్రిప్పుతూనే వున్నాను. కాని ఎంగేజ్ వచ్చింది.

చంద :- ఇది బాగానేవుంది. నేనుకూడ 3 గం॥లనుండి 3 గం॥ల 15 ని॥ల వరకు మీకోసం ట్రై చేసాను.

వర్మ :- ఓహో అదా ! అందుకే ఇద్దరికీ టెలిఫోను రాలేదు.

చంద := మీరువచ్చి ఎంతసేపైంది ?

వర్మ :- ఒక వెయ్యి ఎనిమిది వందల ముప్పైరెండు (1832) సెకన్లు అయింది.

చంద :- ఓహో !

వర్మ :- మొన్న యిక్కడ డ్యాన్సు జరిగింది, వచ్చావా ?

చంద :- రాలేదు.

వర్మ :- ఎందుకు రాలేదూ ?

చంద :- ఎందుకంటే తమరు రాలేదని.

వర్మ :- నేను రాలేదని మీకు ఎలాతెలిసింది ?

చంద :- ఇదికూడ ఒక కష్టమైన పనేనా ? క్లబ్‌కి ఫోన్ చేసి తెలుసుకున్నాను.

వర్మ :- మీరు చాల తెలివైనవారే.

చంద :- మీరు సరిగ్గానే చెప్పారు.

వర్మ :- ఊ ! (యిద్దరూ నవ్వుతారు)

వర్మ :- నేను క్యాంపుకి పోతున్నాను.

చంద :- ఎక్కడకి ?

వర్మ :- మద్రాసు.

చంద :- ఎన్ని రోజులు మకాం?

వర్మ :- ఎనిమిది రోజులు.

చంద :- మైగాడ్ ! ఎనిమిది రోజులే ?

వర్మ :- ఏం ? ఎందుకలా అంటావు ?

చంద :- తమరు ఎనిమిది రోజులదాకా కలవరన్నమాట.

వర్మ :- అవునండి.

చంద :- నయ్యం మంచిపని చేసారు. మీరు చెప్పకపోతే రోజూ ఫోను చేస్తుండేదాన్ని.

వర్మ :- మీకు అక్కడనుంచి ఏమి తెమ్మంటారు ?

చంద :- మీరు జాగ్రత్తగా వస్తే చాలు.

వర్మ :- హాం!

చంద :- అవును.

వర్మ :- మీ "పింటూ"కి ఎలా ఉంది?

చంద :- రెండు మూడు రోజుల నుంచి అనారోగ్యం పాలైంది. ఇప్పుడు కొంచెం నయంగా వుంది.

వర్మ :- అసలు ఏమైంది?

చంద :- నౌకరు దానికి టోన్డు మిల్కు పట్టించాడు. అందుచేత కడుపు నొప్పి వచ్చింది.

వర్మ :- మీ పింటూ చాలా నాజూకైనది.

చంద :- దాని తర్వాత అది బిస్కట్టులు తినలేదు.

వర్మ :- డాక్టర్‌కి చూపించారా?

చంద :- డాక్టర్ని యింటికే పిలిపించాను. ఆరు యింజక్షన్లు యిచ్చాడు.

వర్మ :- మీ పింటూ చాలా స్వీటుగా వుంటుంది, నా కెంతో యిష్టం. ఇప్పుడు నన్ను, అది బాగా గుర్తుపడుతోంది. ఇప్పుడు నన్ను చూస్తే అది నా కాళ్ళను మెలివేసి తోక ఆడిస్తుంది.

చంద :- ఇప్పుడు అది మనవాళ్ళను బాగా గుర్తుపడుతోంది.

వర్మ :- ఈ రోజు నేను త్వరగా పోవాలి. మిమ్మల్ని కలుసుకోవాలని వచ్చాను.

చంద :- ఇవ్వేళ మీరు నా కొకపని చేసిపెట్టాలి.

వర్మ :- మీకు ఏ సేవ కావలిస్తే అది చెయ్యడాన్కి రెడీగా ఉన్నాను.

చంద :- మీరు చేస్తానంటే చెపుతాను.

వర్మ :- అయితే మీకు నామీద నమ్మకం లేదా ?

చంద :- నాకోసం మీరు ఏదైనా చేస్తారని నమ్మకం ఉంది.

వర్మ :- హు !

చంద :- హ, అవును.

వర్మ :- అయితే నాకు చెప్పండి మరి.

చంద :- మీదగ్గర "పైపులసప్లై"కని టెండరు అడిగారుటగదా !

వర్మ :- దానికి రేపు ఆఖరి రోజు.

చంద :- మా జనరల్ మేనేజరుగారు నాకు టెండరు యిచ్చేసారు. అది మీకు పంపడం మర్చిపోయాను.

వర్మ :- అయితే నేను మళ్ళీ దాన్ని మరచిపోను.

చంద :- మిష్టర్ వర్మ ! దాన్ని సమయంలో పంపడం నా బాధ్యత.

వర్మ :- అయితే యిప్పుడు ఏంచేయాలి ?

చంద :- తమరు నా దగ్గరనుంచి తీసుకొని ప్రొద్దుటే మిగిలిన టెండర్లలో కలిపి వెయ్యండి.

వర్మ :- (కొంచెం ఆలోచనలో పడతాడు)

చంద :- ఏమిటి ఆలోచిస్తున్నారు ?

వర్మ :- ఏమీలేదు.

చంద :- మీ కేదైనా ఇబ్బందైనా వుంటే చెయ్యక్కర్లేదు. మహా పోతే నా ఉద్యోగం పోతుంది, అంతేగా! మీకు నా ఉద్యోగం గురించి బాధ్యత ఏముంది ?

వర్మ :- నీ ఉద్యోగం ఏమీ పోదులే.

చంద :- నిజంగానా ?

వర్మ :- నా ఉద్యోగం పోతుంది. కాని ...

చంద :- ఓ మిష్టర్ వర్మ ! "డోంట్ టెల్ మి దట్" ఎందు కంటారు ?

వర్మ :- ఈ పని అంత సులభమైనది కాదు.

చంద :- మీరు నాకోసం ఏమీ చెయ్యలేరన్నమాట.

వర్మ :- ఏదో తప్పుతుందామరి.

చంద :- మీరు ఎంత మంచివారండి.

వర్మ :- హు !

చంద :- నడవండి.

వర్మ :- సర్లే, కానీ. (ఇద్దరూ లోపలికి వెడతారు. దారిలో కిశోర్ లాల్, హజారీలాల్ లోపల్నుంచి వస్తూ కలుస్తారు.)

హజారీలాల్ ;— (వర్మపైపు చూస్తూ) దీని కేమీ జవాబు లేదా ?

కిశోర్‌లాల్ :— భగవంతుడు ఎప్పుదో ఒకప్పుడు మేలుచేస్తాడు.

హజారీలాల్ :— అవును మిత్రమా, నిన్నసాయంత్రం ఏమైంది?

కిశోర్‌లాల్ :— నిన్న రజనీ వ్యామోహంలో పడ్డాను.

హజారీలాల్ ;— రజనీ ఎవరు ?

కిశోర్‌లాల్ :— అలా గడగవద్దు. ఆమె ఎంత అందంగా ఉందో వర్ణించలేము. చూస్తే చాలు కడుపు నిండిపోతుంది.

హజారీలాల్ :— నిజంగానా ?

కిశోర్‌లాల్ :— అవును, నీమీద ఒట్టు.

హజారీలాల్ :— నీ కెన్నిసార్లు చెప్పేనురా, ఇతరుల వస్తువు తింటే తిన్నావు, కనీసం ఒట్టయినా నీమీద పెట్టుకోమని చెప్పాను, ఒట్టు ఏమైనా కొనాలా ? ఊరికే వచ్చేదేగా !

కిశోర్‌లాల్ :— నామీద ఒట్టు. ఆమెను చూస్తే ఎంతో ఆనందం అనిపించింది.

హజారీలాల్ :— ఇంకా చెప్పరా, ఏమైందో ?

కిశోర్‌లాల్ :— అసలే అమ్మాయి అపురూప సౌందర్యవతి. ఠీవిగా నిల్చుంది, ఇంకేం ఉంది.

హజారీలాల్ :— తర్వాత ఏమైంది ?

కిశోర్‌లాల్ :— ఆమె అందరికంటె ఎంతో అందమైనది. ఆమెను చూస్తూ మంత్రముగ్ధుడనై పోయాను.

హజారీలాల్ :- (ఆశ్చర్యంగా) అంత మోహించావురా ?

కిశోర్‌లాల్ :- ఆమెను చూస్తుఉంటే ఆమె నాతో ఇలా అన్నట్లు అనిపించింది, "ఫరవాలేదు, నేను నిన్ను ఎప్పుడూ మోసం చేయను".

హజార్‌లాల్ :- ఆ, అవును.

కిశోర్‌లాల్ : దాని నాలుగు కాళ్ళు ....

హజారీలాల్ :- (వులిక్కిపడి) ఏమన్నావూ ? నువ్వు ఎవరి విషయం చెపుతున్నావు ?

కిశోర్ లాల్ :- భాయీ ! రేస్ విషయం చెపుతున్నానురా "రజని" గుర్రంరా బాబు. దానిమీద నేను 500 రూ॥లు పందెం కాసాను. చూడ్డానికి చాలా బావుంది. కాని అన్నింటి కంటె వెనక్కాల వచ్చింది.

హజారీలాల్ :- అయ్యో ! (చంపత్‌రాయ్ ప్రవేశిస్తాడు)

చంపత్‌రాయ్ :- మీ పని పూర్తిచేసాను.

కిశోర్‌లాల్ :- ఏమిటి ?

చంపత్‌రాయ్ :- నేను వర్మగారితో మాట్లాడాను.

కిశోర్‌లాల్ :- నిజంగానా ?

హజారీలాల్ :- మనతో అతను చాలా కటువుగా మాట్లాడాడు.

చంపత్‌రాయ్ :- ఈ ఆఫీసర్లతో డైరెక్టుగా మాట్లాడకూడదు. ఎవరైనా పరిచయస్తులచేత మాట్లాడించాలి. మీతరపునుంచి

టేపురికార్డరు వస్తుందని వాగ్దానం చేసా.

హజారీలాల్ :— అతను తీసుకున్నాడా ?

చంపత్‌రాయ్ :— ప్రతీ పనీ చాలా ఆలోచించిచేయాలి. ఏముంది రెండుమూడు సార్లు పార్టీలుయిస్తాను. భగవంతుడు సాయం చేస్తాడు. ఇల్లాంటి విషయాల్లో డబ్బు ఖర్చు ఎక్కువే అవుతూంటుంది.

కిశోర్‌లాల్ : ఖర్చుకేం వుందిలే పని జరగాలి గాని

చంపత్‌రాయ్ : ఇదంతా బాగానే జరిగింది, అందుచేత యిప్పుడొక 1000 రూ॥లు నోటు యివ్వండి.

హజారీలాల్ : ఒక వెయ్యేమిటి, 2000 రూ॥ చెక్కు తీసుకోండి,

చంపత్‌రాయ్ : ఇది సెల్ఫ చెక్కేనా ?

హజారీలాల్ : ఆ, అవును

చంపత్‌రాయి : అయితే మంచిదే. (చెక్కు జేబులో పెట్టుకుంటాడు) వద్దండి నాకొక పైసా కూడా ఎక్కువ వద్దు, భగవంతుడు నా సంపాదన తోనే సుఖమివ్వాలి. మీ పని అయిపోవాలి. మీకు సాయం చేస్తే నాకు వచ్చిన నష్టమేమిటి ?

హజారీలాల్ : మీరు భలే వారండి:

చంపత్‌రాయి :— నేను మీ స్వామ్మున్ని జాగ్రత్త పెట్టి అకౌంటు వ్రాస్తుంటాను.

(చంద, వర్మ లోపలి నుండి వస్తారు)

చంపత్‌రాయి : మిష్టర్ వర్మ : వెళుతున్నారా ?

వర్మ : ఈ వేళ యింటి దగ్గఱ చాలా పనుంది

చంప లాల్ : వీరే శెట్టి కిశోర్‌లాల్

వర్మ : నేను వీరిని ఎరుగుదును మంచిది గుడ్‌నైట్

చంపత్‌రాయి : గుడ్‌నైట్,

(వర్మ, చంప బయటకు వెడతారు)

చంపత్‌రాయి : చూడు మిత్రమా: అతను మిమ్మల్ని "నేను ఎరుగుదును" అని అన్నాడు. అందరి ముందు అంతకంటె ఎక్కువ ఏమి చెపుతాడు మీ గురించి అంతా చెప్పాను. ఈ విషయం మీద పని బాగా జరిగిపోతుంది.

కిశోర్‌లాల్ : ఏమవుతుంది ?

చంపత్‌రాయి : ఒక్కటీ చిన్నది, మూడు పెద్దవి, బడేమియా?

హజారీలాల్ ? ఇంతకు ముందు మిమ్మల్ని చూడనైనా చూడలేదు ఇప్పుడు యిపన్నీ తెలుసు అని అంటున్నాడు.

చంపత్‌రాయి ! నేను మిమ్మల్ని చాలా పొగిడాను. అంతా చెప్పాను.

బడేమియు ; మూడు తెచ్చానండి? (మూడింటిలో ఒక్కొక్కటి తీసుకుంటారు. ముగ్గురూ ఒక గాసుతో మరొక గాసు కలుపుతారు. గట్టిగా "చీర్సు" అంటారు

(తెరలో గట్టిగా పాశ్చాత్య సంగీతం వినిపిస్తుంది.)

( ద్వితీయ దృశ్యము )

(వర్మయిల్లు)

[ అది వర్మ కూర్చునే హాలు. హాలు ఆధునిక పద్ధతిగా అలంకరింపబడి వుంది. స్టేజి మధ్యన వెనుకవైపు కొంత భాగము ఖాళీ స్థలం. దాని తర్వాత తోట. ఆ తోటలో పూలకుండీలు కనుపిస్తూ వుంటాయి. బయటనుండి లోపలికి పోవు మార్గము. స్టేజి ఎడమవైపున లోపల్నించి రావడాన్కి మార్గము కుడివైపు నుంచి తలుపులు వున్నాయి. ]

రమ : (తెరలో) రాజూ ! ఓ రాజూ ! ఇలారారా ! (రమ రాజు స్వెట్టర్ తీసుకొని స్టేజిమీదకు వస్తుంది.) రాజూ ! స్వెట్టర్ వేసుకో. అబ్బా ! ఎక్కడ దాక్కున్నావురా ? (రమ యిటు అటు చూస్తుంది. రాజు తోటలోనుంచి మెల్లిగా మెల్లిగా కనబడకుండావచ్చి రమ వెనక్కాల నిల్చుంటాడు. రమ స్టేజి మీద యిటు అటు తిరుగుతుంది. రాజు ఆమె వెనకాలే నడుస్తాడు. రాజు నోటిమీద వ్రేలు పెట్టుకొని చెప్పవద్దని, ప్రేక్షకులకు సంజ్ఞ చేస్తాడు. రాజు ఫక్కున నవ్వేస్తాడు.)

రమ : (రాజుని పట్టుకుంటుంది) కొంటె వెధవా ! ఇప్పటినుంచి యిలా వుంటే పెద్దయ్యాక ఏమవుతావో ?

రాజు : మమ్మీ ! నేను పెద్దవాడ నయ్యాకా ....

రమ : పెద్దవాడ వయ్యాక ఏమౌతావ్రా ?

రాజు : చెప్పనా ! ఏమౌతానో ?

రమ : ఆ చెప్పు చూద్దాం ? ఏమౌతావో ?

రాజు : నేను పెద్దవాడినయ్యాక పెళ్ళికొడుకు నవుతా.

రమ : అయితే నన్ను నీ పెళ్ళికి తీసుకెళతావా ?

రాజు : తీసుకెళ్ళను.

రమ : ఎందుకు తీసుకెళ్ళవూ ?

రాజు : నువ్వు నీ పెళ్ళికి నన్ను తీసుకెళ్ళావా ?

రమ : (నవ్వుతుంది) బయటకు వెళ్ళకు. ఇవాళ చాలా చలిగా వుంది.

రాజు : అయితే నాన్నకు చలి వెయ్యదా ? నాన్న బయటకు ఎందుకు వెళ్ళాడు మరి ? మమ్మీ ! నాన్న క్లబ్‌కి వెళ్ళాడు కదా మరి ?

రమ : లేదు, క్లబ్‌కి నాన్న రాత్రి వెళతారు.

రాజు : మమ్మీ ! నేనూ నాన్నని ఎప్పుడు అవుతా ?

రమ : నాన్నవై ఏంచేస్తావు ?

రాజు : నేనుకూడా క్లబ్‌కి వెళతానూ.

రమ : అయ్యో ! పాలు పొంగిపోయాయి. (రమ లోపలికి వెడుతుంది. యింతలో టెలిఫోను గంట మ్రోగుతుంది. రాజు టెలిఫోను ఎత్తుతాడు.)

రాజు : హలో ! హలో ! నేను డాడీ కొడుకుని మాట్లాడుతున్నాను. డాడీ ఎప్పుడువస్తారో మమ్మీని అడిగి వస్తా. (టెలి

ఫోను క్రిందపెట్టి లోపల తలుపువైపు వెడతాడు.) మమ్మీ, డాడీ ఎప్పుడు వస్తారు ?

రమ : (తెరలోనుండి) ఆయన ఇష్టం వచ్చినప్పుడు వస్తారు, నీ పని నువ్వు చూసుకో.

రాజు : (టెలిఫోనుఎత్తి) అమ్మ ఏమనిచెపుతుం దంటే, ఆయన ఇష్టం వచ్చినప్పుడు వస్తారు, నీ పని నువ్వు చూసుకో.

రమ : (ప్రవేశించి) ఎవరి ఫోనూ ?

రాజు : ఎవరో మాట్లాడుతున్నాడు.

రమ : ఇంకా రాలేదేమి ? కూరలు తెస్తానని వెళ్ళాడు కాకా. గంటైంది వెళ్ళి. ఎప్పుడు కూరలు తెస్తాడు, ఎప్పుడు వంట య్యేది ?

రాజు : దారిలో ఎవరో సాధువు కనిపించి వుంటాడు. అయనతో కబుర్లు చెబుతూ వుంటాడు.

(రమ లోపలికి వెడుతుంది, రాజు ఆడుకుంటు వుంటాడు. కాకా ప్రవేశిస్తాడు. ఒక చేతిలో కూర్లసంచి, రెండవ చేతిలో ప్రసాదం తెస్తాడు.)

కాకా : తీసుకో ప్రసాదం, బాబూ.

రాజు : (చేయిచాచి ప్రసాదం తీసుకుంటాడు) ప్రసాదం కొంచెం పెడతావూ. రెండుచేతులు చాపమంటావు.

కాకా : ప్రసాదమంటే ప్రసాదమేమరి. ప్రొద్దున్నే భగవంతుని దర్శనం చేస్తే మనస్సు ఎంతో బాగుంటుంది. (లోపలికి వెళతాడు)

రాజు : కాకా! స్టాప్! స్టాప్!

కాకా : విషయమేమిటి?

రాజు : మమ్మీకి కోపం వచ్చింది.

రాజు : ఏమంటుంది? "ఒక గంటైంది. కాకా ఇంకా రాలేదు. ఎప్పుడు వస్తాడో, ఎప్పుడు కూరలు తెస్తాడో? ఎప్పుడు వండుతాను?" అని.

కాకా : నువ్వేమన్నావు అప్పుడు?

రాజు : ఎవరో సాధువు దొరికి వుంటాడని అన్నాను.

రమ : (లోపల్నుంచి వస్తుంది) కాకా! ఇవాళ ఇంత ఆలస్యం చేశావేం?

కాకా ఈ ప్రసాదం తీసుకోండమ్మా. (రమ ప్రసాదం తీసుకుంటుంది) కూరలవాడు బంగాళాదుంపలకు డబ్బులు తీసుకోవడం మర్చిపోయాడు. వాడు నాకు 40 పై॥ ఎక్కువ ఇచ్చాడుగుడికివచ్చాక నాకు జ్ఞాపకం వచ్చింది. నేను పైసలు వాపసు చేయడానికి వెళ్ళాను.

రమ : మంచిపనే చేసావు. అన్యాయపు సొమ్ము అరగదు. భగవంతుని దయవలన మన సంపాదనలోనే మనకు ఫలము లభించాలి. కాని, కాకా! నువ్వు కూరలను నాకిచ్చేసి తరవాత వెళ్ళి పైసలు ఇచ్చి రావచ్చునుగా?

కాకా : అమ్మగారూ! మనవికాని పైసలు మన యింట్లోకి తేవడం నాకు ఇష్టంలేదు. అన్యాయపు సొమ్ముమీద ఆశ కలగచేయు

వద్దని భగవంతుని ప్రార్థిస్తూ వుంటాను. నయం జ్ఞాపకం వచ్చింది. లేకపోతే దానితో ఏం కొంటామో? ఎవరు తింటారో?

రమ:- కూరలు నాకియ్యికాకా! ఈ వేళచాలా ఆలస్యమైంది. (కూరలసంచి తీసుకుని లోపలికి వెడుతుంది)

రాజు:- కాకా! నేను గుఱ్ఱమువెక్కుతాను.

కాకా:- రా. ఎక్కుబాబూ! (కాకా గుఱ్ఱములా కాగా రాజు అతని నడ్డిమీద ఎక్కి కూర్చుంటాడు)

రాజు:- నీవు గుఱ్ఱానివి కావా?

కాక:- కాకపోతే ఏమిటి?

రాజు:- గుఱ్ఱం ఎక్కడైన ఇంత నెమ్మదిగా నడుస్తుందా? నువ్వు చిన్న గుఱ్ఱానివి.

రాజు:- నేను ఫోను తీస్తాను (ఫోనుగంట మోగుతుంది.) కాకా, (రాజు ఫోను ఎత్తుతాడు)

రాజు:- నేను మాట్లాడుతున్నాను. నేనూ, మమ్మీ అబ్బాయిని, మాట్లాడుతున్నా — — వారికి తోచినప్పుడు వస్తారు. నువ్వు నీపనిచూచుకో. (ఫోను పెట్టేస్తాడు.)

కాకా;- ఫోనులో అల్లాగ మాట్లాడ కూడదు.

రాజు:- మరి ఎల్లాగ మాట్లాడాలి?

కాకా:- వాళ్ళు నాన్నగార్ని పిలిచారా?

రాజు:— అవును

కాకా:— ఎప్పుడు వస్తారో, తెలియదని చెప్పాలి

రాజు:— కాకా! నాకు దుకాణం నుండి చాక్‌లెట్లు కొనిపెట్టు వెడదాంరా, మరి

కాకా:— నడు బాబూ మంచిదినడు

రాజు:— ఊం అంటే లాభంలేదు

కాకా:— అయితే ఏమనాలి? (రాజు అతని నడ్డిమీద కూర్చుంటాడు కాకా రాజుని తీసుకుని బయటకు వెడతారు అప్పుడే ఎవరో తలుపు తట్టుతారు (విరామం)

రమ:— ఎవరు? ఝుంగూర పర్షిసాదు! (బయట నుండి) నేనండి, నేను లాలా ఝుంగూర పర్షిసాదును

రమ:— లోపలికి రండి (లాలాఝుంగూర పర్షిసాదు లోపలికివస్తాడు అతనితోకూడ నౌకరు పండ్లబుట్టతెస్తాడు)

ఝు. ప:— చెప్పడానికి ఏమీలేదులెండి అయ్యగారు ఇంట్లో ఉన్నారా?

రమ:— లేరు

ఝు. ప:— చెప్పవలసినది ఏమీలేదు నేను వారిని కలుసుకోవాలని వచ్చాను

రమ : వారు బయటికి వెళ్ళారు.

ఝు. ప:— ఏం ఫరవాలేదులెండి మాకు అయ్యగారికంటె మీరే ముఖ్యం

రమ : ఏం కావాలి ?

ఝు ప్ర : చెప్పవలసినదే మున్నది లెండి ? నేను మీ దాసుణ్ణి (కూర్చుంటాడు) క్షమించండి నేను ఎంత మూర్ఖుణ్ణి, మీరు నిలుచున్నారు నేనూ నిలుచుంటాను మీరు కూర్చోండి

రమ : (కూర్చుంటుంది) ఏమిటి? మీరు చెప్పేదానికి శ్రమపడుతున్నారు

ఝు ప్ర : శ్రమ ఏముంది చెప్పవలసినదేముంది మేము మీ సేవకులం

రమ : అయ్యగార్ని కలుసుకున్నారా ?

ఝు॥ ప్ర॥ : అయ్యగార్ని ఒకసారి ఆఫీసులో కలుసుకున్నాను. మళ్ళీ అయ్యగార్ని యింట్లో కలుసుకుందామని వచ్చాను. అయ్యగారితోపాటు మీ దర్శనం కూడా లభిస్తుందని ఇంటికి వచ్చాను. చెప్పవలసిన దేముంది ?

రమ : ఆయన ఎప్పుడు వస్తారో తెలియదు.

ఝు॥ ప్ర॥ ఫరవాలేదు లెండి, మునుపు అయ్యగారు వుండే పదవిలో యింకొక ఆయన వుండేవారు చెప్పే దేముంది, ఆమె కూడా మీలాగే మంచిది, సాక్షాత్తు దేవత.

రమ ; మీరు ఏం చేస్తుంటారు ?

ఝు॥ ప్ర॥ నేను వ్యాపారస్తుణ్ని. ఏదో మీమీద ఆధారపడి బ్రతుకుతున్నాను. మీకేదైనా కావలిస్తే కబురు పెట్టండి, పంపిస్తు వుంటాను. ఈ ఝుంగూరు ప్రసాదు అల్లావుద్దీన్ అద్భుతదీపం

లాగ ఏం కావలసివస్తే అది యిస్తాగంను. చిన్నసాహసం,
వచ్చేనెల నుండి ఒక వ్యాపారం ప్రారంభిద్దామని అనుకుం
టున్నాను. అందుకు యీబీదవాడికి మీసహాయం అవసరం.

రమ : అమ్మగారి ఆఫీసు విషయాలలో జోక్యం కలుగజేసు
కోను నేను.

ఝు॥ ప్ర॥ చెప్పే దేముంది, మీకు వారిమీద పూర్తిగా నమ్మ
వుంది ఒకసారి మునుపు వుండే ఒక అమ్మగారు నామీద
కోప్పడ్డారు. కాని అమ్మగారు నాతో అభిమానంగా వుండే
వారు, అప్పుడు ఆమె సమ్మో చేసారు. అంతే నాకని పూర్తి
అయిపోయింది.

రమ : (లేస్తూ) చూడండి, మీరు వార్ని ఆఫీసులోకలుసుకోండి
ఝు॥ ప్ర॥ మంచిది, ఇవి లోపల పెట్టండి. (పండ్ల సంచి పైపు
చూపి)

రమ : ఏమిటివి ?

ఝు॥ ప్ర॥ : ఏమీలేదు లెండి.

రమ : అయితే దయచేసి మీ ఏమీ లేదని మీతో తీసుకెళ్ళండి.

ఝు॥ ప్ర॥ : చెప్పవలసిన దేముంది ? నేను కాశ్మీరు వెళ్ళాను
వచ్చేటప్పుడు పండ్లు తెచ్చాను, ఇవి తీసుకోండి ఝుంగూరు
ప్రసాదు తెచ్చాడని అమ్మగారితో చెప్పండి, సిల్కు చీర
కూడ అక్కడినుండే తెచ్చాను.

రమ : కాశ్మీరులో కమలాఫలములు వుండవే ! ఊటాలంగా జాను
సిల్కుచీర తేవడానికి కాశ్మీరు వెళ్ళిరావలసి వచ్చిందా ?

రఘు॥ ప్ర॥ : అబ్బే ఏమీలేదు లెండి, పిల్లలకోసం తెచ్చాను.

రమ : ఈ ఇంట్లో ఒక్క పిల్లవాడే వున్నాడు, నేను వాడ్ని ఈ విషం తిననివ్వను, ఈ సంచిని వెంటనే తీసుకుపొండి.
(కాకా వస్తాడు)

కాకా : ఏమిటమ్మా ?

రమ : కాకా ! ఈ సంచి అవతల పెట్టు.

కాకా : ఈ సంచిలో ఏమున్నాయి ?

రమ : లంచం.

రఘు॥ ప్ర॥ : ఇవి పండ్లయ్యా కాకా!

రమ : వీటిని లంచంగా తెచ్చారా ?

కాకా : (ఆ సంచిని పట్టుకొని) త్వరగా పట్టుకుపో.
(రఘునాథప్రసాదు, అతని నౌకరు సంచి తీసుకొని వెళ్లి పోతారు)

రమ : ఏం మనుష్యులో ఏమిటో ! విచిత్ర ప్రపంచం. లంచం ఇవ్వడానికి సిగ్గయినా ఉండదు.

కాకా : భగవంతుని దయవల్ల ఈ యింట్లోకి పాపపు సొమ్ము రాకూడదు తల్లీ.

రమ : కాకా ! రాజు ఎక్కడ ? వాడు నీతో వచ్చాడుకదా !

కాకా : ఒ.నుట ఆడుకుంటున్నాడు.

రమ : పదేలే నాకు లోపల పనుంది. (రమ లోపలికి వెడుతుంది)

(కాకా చీపురుతో గది తుడిచి వస్తువులు దులిపి పెడతాడు. తలుపు ఎవరో తట్టుతారు)

చుట్టన్ : కాకా ! నేను చుట్టన్‌ని, రాం రాం.

కాకా : రాం రాం. ఏమయిందిరా నీకు, పూర్తిగా దొరగారివి అయిపోయావు, ఎంత మారిపోయావు !

చుట్టన్ : రాత్రి, పగలు ఆఫీసర్ల మధ్యనే ఉంటాను. నేను కూడ వాళ్ళలాగే పంట్లాం వేసుకుంటున్నాను.

కాకా : చాలా రోజులకి వచ్చావు.

చుట్టన్ : ఏంచేయను కాకా ! నేను చాలా బిజీగా వున్నాను. కాళీయే దొరకడం లేదు.

కాకా : ఊరునుండి ఉత్తరం వచ్చిందా ?

చుట్టన్ : మొన్న మా అమ్మదగ్గరనుండి ఉత్తరం వచ్చింది.

కాకా : అంతా బాగున్నారా ?

చుట్టన్ : అందరూ ఆల్‌రైట్‌గా వున్నారు.

కాకా : ఏమిటి యింగ్లీషు మాటాడుతున్నావ్ !

చుట్టన్ : ఇప్పుడేముంది, వెళ్ళేటప్పుడు గుడ్‌నైట్ ఎంత బాగా చెప్తానో చూడు.

కాకా : అదికూడ చూద్దాం. జీతం ఎంత ?

చుట్టన్ : 100 రూపాయలు. రెండుపూటలా అన్నం, రెండుసార్లు టీ యిస్తారు.

కాకా : అయితే బాగానే ఉంది నీపని.

చుట్టన్ : చాలా మంచి ఉద్యోగమే. జీతం కాకుండా టిప్పు పైసలు కూడా వేరే దొరుకుతాయి.

కాకా : టిప్పు అంటే దుస్తులా? ఊనిఫారమా?

చుట్టన్ : కాదు కాకా. ఊనిఫారాన్ని ఇంగ్లీషులో యూనిఫారం అంటారు. టిప్పు అంటే బహుమతి. ఆఫీసర్లందరూ పైసలు వదలి వెళతారు.

కాకా : ఆ డబ్బుల్ని మీరు తీసుకుంటారా? రామ రామ.

చుట్టన్ : కాకా యివి ఆఫీసర్లు సంతోషంగా వదిలి వెళతారు. ఒక్కొక్క రోజు అయితే ఐదు, ఆరు రూపాయలదాకా టిప్పు దొరుకుతుంది.

కాకా : (ఆశ్చర్యంగా) ఐదు, ఆరు రూపాయలదాకా దొరుకుతుందా?

చుట్టన్ : ఆ దొరుకుతుంది కాకా. ఆఫీసర్లు ఎక్కువ టిప్పు వదిలితే వంగి సలాముచేస్తాము. ఎవరయినా తక్కువ టిప్పు వదిలితే వంగకుండా సలాము చేస్తాము. (తల ఊపుతాడు) ఏమీ ఇవ్వని వాళ్ళని ఈ వెధవ ఎక్కడినుంచి వచ్చాడని చెప్పి మనస్సులో తిట్టుకుంటాము.

కాకా : మీ క్లబ్‌లో ఇంకా ఏమి జరుగుతుంటాయి.

చుట్టన్ : కిలబ్ (క్లబ్) అయితే ఒక క్రొత్త ప్రపంచం కాకా. రోజూ సాయంకాలం ఉత్సవం జరుగుతూ ఉంటుంది. ఆఫీ

సర్లు బాగా ముస్తాబయి ఠీవిగా వస్తారు. అక్కడ ఆడవాళ్లు కూడ సిగరెట్లు త్రాగుతారు. ఆఫీసర్లు బెత్తంపట్టుకొనివస్తారు. వాయిద్యాలు వాయిస్తారు. అర్ధరాత్రి దాకా డ్యాన్సులు జరుగుతాయి. ఏంచెప్పను కాకా ! ఆ పెద్దమనుషులుఅంతా ఇతరుల భార్యల చేతులు పట్టుకొని నడుంమీద చేయి వేసి రాకెన్‌రోల్ డ్యాన్సు చేస్తూ ఉంటారు. నాకు కూడ డ్యాన్సు చెయ్యడంవచ్చేసింది, చూడు ఎంతబాగాచేస్తానో డ్యాన్సు.

కాకా : అక్కడ వాళ్ళు సారా త్రాగుతుంటారా ?

చుట్టన్ : సారా ఏమిటి ? విచికీ (విస్కీ) ఎక్కువగా త్రాగుతూ వుంటారు.

కాకా : బీచ్‌కీయా ?

చుట్టన్ : బీచ్‌కీ కాదు, విచ్‌కీ. (నవ్వు)

కాకా : రేయ్ నువ్వు త్రాగవు కదా?

చుట్టన్ : నేను త్రాగను కాకా, నేనైతే— — —

కాకా : నేనైతే ఏమిటి ?

చుట్టన్ : అప్పుడప్పుడు రుచి చూస్తుంటాను. నువ్వు ఎప్పుడైనా కిలబ్ [క్లబ్]కి వస్తే అన్ని తమాషాలు చూపిస్తాను.

కాకా: నేను అలాంటి చోటుకి రాను నాకేం అవసరం ?

చుట్టన్ (హఠాత్తుగా చుట్టన్‌దృష్టి గదిలో వ్రేలాడుతున్న వర్మఫోటో మీద పడుతుంది.) ఈ ఫోటోలో వర్మగారులా వున్నారే ?

కాకా : అవును

చుట్టన్ : వీరు క్లబ్‌లో కనిపిస్తుంటారు

కాకా : అవును. వీరికి క్లబ్‌కి వెళ్ళే అలవాటుంది

చుట్టన్ : ఒక మాట చెప్పనా కాకా

కాకా : ఏమిటి ?

చుట్టన్ : [నెమ్మదిగా] కలబ్‌లో ఒక మిస్ వస్తుంది. ఆమె పేరు చంద. ఆమె చాలా అందంగా ఉంటుంది. కిలబ్‌లో పెద్దపెద్ద ఆఫీసర్లు ఆవిడ చుట్టూ మూగుతూ వుంటారు. ఆమె మాత్రం ఈ అయ్యగారికే యిష్టపడుతుంది.

కాకా : ఏమిటిరా వాగుతున్నావు

చుట్టన్ : నేను నిజంగా చెబుతున్నాను కాకా, ఆమె వర్మగార్ని "డార్లింగు" అంటూ వుండగా నేను విన్నాను

కాకా : దాని అర్థమేమిటి ?

చుట్టన్ : ఎవరైనా మగవాడు స్త్రీని, "పిరేమ" [ప్రేమ] చేస్తు ఉంటే అతనిని డార్లింగు అంటుంది.

కాకా :- మా అయ్యగారు అటువంటివారు కాదే!

చుట్టన్ :- కిలబ్‌లో అందరూ అదే అంటారు, "చంద వర్మగారిని వలలో చేసుకొందని" ఆమె అయ్యగారిచేత అన్నివనులు చేయించుకుంటూ ఉంటుందని అంటారు,

కాకా :- (కోపంగా) జాగ్రత్త ఎప్పుడైనా అలాఅన్నావంటే!

చుట్టన్ :- (మాటమారుస్తూ) ఆ విషయంలో వర్మగారిది తప్పు లేదు. (చుట్టన్ ప్రక్కకు తిరగగానే వర్మ కనుపిస్తాడు.

[చుట్టన్ వెంటనే నోరుమూసేస్తాడు]

[అమాంతంగా "సిఫార్సు మీద వచ్చిన వాడ్ని" అంటూ

పరుగెత్తుతాడు]

వర్మ : ఈ చుట్టన్ ఇక్కడకు ఎందుకు వచ్చాడు ?

కాకా : వీడు మా ఊరివాడు. ఒకసారి బజార్లో కనబడితే మన యింటికి రమ్మని చెప్పాను

వర్మ : ఏమిటి అంటున్నాడు

కాకా : ఏమీ లేదు బాబుగారు. నిన్న రాత్రి మీరు క్లబ్‌నుంచి చాలా ఆలస్యంగా వచ్చారు.

వర్మ : అవును

కాకా : బాబుగారూ, ఒక మాటచెపుతాను కోప్పడకండి, ఈమధ్య మీరు చాలా మారిపోతున్నారు.

వర్మ : ప్రపంచంలో అన్ని వస్తువులూ మారుతూనే ఉంటాయి. సూర్యుని వేడి, చంద్రుని చల్లదనము, వెన్నెల ఎప్పుడూ ఒకే రకంగా ఉండవు.

కాకా : సూర్యుడు ఎప్పుడూ తనతేజస్సును వదలడు, చంద్రుడు తన చల్లదనాన్ని వదలడు. అదే విధంగా మానవుడు తన మంచితనాన్ని, సత్ప్రవర్తనను వదలకూడదు.

వర్మ : సత్ప్రవర్తన, మంచితనపు పరిమాణం కూడా మారుతూ వుంటుంది, కాకా.

రమ : (ప్రవేశించి) కాకా, కాన్తరాజుని పిల్చుకొనిరా.

కాకా : మరచిదమ్మా. (బయటికి వెళతాడు)

రమ : మీతో కాకా ఏదో వాదిస్తున్నట్లున్నాడు ?

వర్మ : కాకాకి అప్పుడప్పుడు వాదించాలని బుద్ధిపుడుతువుంటుంది.

రమ : కాకా ఎపుడూ జ్ఞానం గురించి చెపుతూ ఉంటాడు. ఏవో మంచి మంచి గ్రంథాలు చదువుతూ ఉంటాడు.

వర్మ : లావు పుస్తకాలు చదువుతూవుంటే తెలివికూడా లావవుతూ ఉంటుంది. నేను వెళ్లిన తరువాత ఎవరైనా వచ్చారా ?

రమ : లాల్‌జీ వచ్చారు.

వర్మ : లాల్‌జీ ఎవరు ?

రమ : అతని పేరూ .... లాలాఝుంగూరుప్రసాదు.

వర్మ : ఓహో! ఝుంగూరు ప్రసాదా!

రమ : అవును ఆ పేరే చెప్పాడు! మాటకు ముందు "చెప్పే దేముంది" అని అంటూ వుంటాడు.

వర్మ : ఆ, అవును. ఇప్పుడు అర్థమయిందిలే ఏం చెప్పాడు?

రమ : పళ్ళూ, వాటితోపాటు ఒక చీర తీసుకుని వచ్చాడు.

వర్మ : వాడు కొన్ని రోజులుపోతే నోట్లసంచి తెస్తాడు.

రమ : ఏమిటి మీ ఉద్దేశ్యం?

వర్మ : అతని కేసు ఒకటి నాదగ్గర వుంది. ఆ కేసులో కావా లనుకుంటే బోలెడు సంపాదించగలను.

రమ : లంచం యివ్వడానికి వచ్చాడని నాకు ముందే అర్థమయ్యింది. వాడిని కోప్పడి పంపించేశాను. పిల్లలకోసం తెచ్చానని చెప్పడం మొదలుపెట్టాడు. ఈ విషం పిల్లవాడికి పెట్టనని స్పష్టంగా చెప్పేశాను.

వర్మ : పండ్లలో విషముండదే!

రమ : లంచం పళ్ళు నేను తీసుకుంటానని మీ ఉద్దేశ్యం?

వర్మ : లంచమనే పళ్ళు ఏమీ ఉండవే! పండ్లు అయితే చెట్లకు కాసాయి.

రమ ; అవి తీసుకుని తినడం మహాపాపం.

వర్మ : పాపం ఏమిటి? పండ్లుతినడం పాపమా?

రమ : లంచం ఇవ్వడం తీసుకోవడం పాపము,

వర్మ : పాపంకాదు. వ్యాపారము, వ్యాపారధర్మం.

రమ : వ్యాపారమైతే, వ్యాపారస్తుడే చేస్తాడు. మీరు ఆఫీసరు కదా!

వర్మ : వ్యాపారములేకుండ పని జరగనే జరగదు. ప్రజలు దేవునితో కూడ వ్యాపారం చేసారు. ఈ భజనలు, కీర్తనలు అన్ని ఏమిటి మరి.

రమ : ఇది భగవంతుని భక్తి.

వర్మ ; భక్తి ఎందుకు త్యాగము, తపస్సు, ఎందుకు చేస్తారంటే ఈ జన్మలో త్యాగముచేస్తే వచ్చేజన్మలో ఏదో లభిస్తుందని ఇదంతా వ్యాపారం కాకపోతే మరేమిటి?

రమ : దీని వల్ల స్వర్గము లభిస్తుంది.

వర్మ : (నవ్వి) స్వర్గమా ? మనుష్యుని లోభానికి అది మారు పేరు. అది వారి దురాశకు ప్రతిబింబము. అది వారి తీరని కోరికలకు అద్దం.

(ఫోను మ్రోగుతుంది. రమ ఫోను ఎత్తుతుంది)

రమ : (ఫోనులో) నమస్కారం. అక్కగారూ. భజన 11 గంటలకు గదా! నేను తప్పకుండా వస్తాను. ఈ రోజు మహాత్మా గాంధీ బోధకూడ ఉంటుంది గదా! — — — — నేను తప్పని సరిగా వస్తాను.

(ఫోను పెట్టేస్తుంది) ఉషా వాళ్ళింట్లో ఈ రోజు భజన వుందిట, నడవండి. మిమ్మల్ని కూడా ఈ రోజు భజనకు తీసుకుని వెడతాను. అక్కడ కీర్తనలు బాగాపాడతారు.

వర్మ : మా క్లబ్‌లో రోజూ భజన జరుగుతూనే వుంటుంది. కీర్తనలు పాడుతూనే వుంటాం. (హేళనగా) నువ్వు నీ కీర్తనలకు వెళ్ళు. నీ పుణ్యంలో సగభాగం నాకు ఎలాగూ వస్తుందికదా:

రమ : (హేళనగా) కాని మీ పాపములో సగం నాకు వస్తే నా పుణ్యం మాయమై పోతుంది.

వర్మ : అయితే వెళ్లు. లెక్క సమానంగా సరిపోతుంది.

రమ : ప్రవర్తన సరిగా వుంది. మీరు చాలా మారిపోయారు. నాకు ఆశ్చర్యం వేస్తుంది

(రాజు వస్తాడు)

రాజు : డాడీ

మ : రాజూ

రాజు : — మమ్మీ

వర్మ : రాజూ నీవెవరి కొడుకువిరా ? అమ్మ కొడుకువా? నాన్న కొడుకువా ?

రాజు : నాకు మీరేమి తెచ్చారు ?

వర్మ : నేను నీ కోసం ఫుట్‌బాల్ తెచ్చాను.

రాజు : మమ్మీ! నీవు నాకేమి తెచ్చావు?

రమ : నేను బజారుకే వెళ్ళలేదు. మధ్యాహ్నం బొమ్మలు తెస్తాను

రాజు : అయితే ఇప్పుడు డాడీ కొడుకుని మధ్యాహ్నం నీ కొడుకుని.

వర్మ : బాగా చెప్పావురా. నీవు పెద్దవాడవు అయిన తర్వాత పొలిటీషియన్‌వి అవుతావు. ఇలారా!

రమ ; మమ్మీ కొడుకువికావా?

రాజు ; రెండు కళ్ళు మూసుకోండి మీరు (రెండు కళ్ళూ మూసుకుంటారు ఇద్దరూ) మీ యిద్దరిలో ముందు ఎవరు నన్ను ముట్టుకుంటారో వాళ్ళకొడుకుని (ఇద్దరూ అతనిని పట్టుకునేందుకు వెడతారు రాజు అక్కడినుండి తప్పుకుంటాడు ఇద్దరూ వాడిని ముట్టుకునేందుకు వెడతారు ఇద్దరూ పడిపోతారు రాజు దూరంగా నిలుచుని చూస్తు వుంటాడు రమ రాజుని ఎత్తుకుంటుంది తర్వాత వర్మ, రాజుని రమనుండి తీసుకుంటాడు)

రమ : నేను రాజుకి పాలు పంపిస్తాను, త్రాగించండి

వర్మ : అయితే "రాజు-డాడీకి" ఒకకప్పు కాఫీకూడ పంపించాలి మరి (రమ లోపలికి వెడుతుంది)

వర్మ : తీసుకో నీకు చాక్లెట్ తెచ్చాను

రాజు : (తీసుకుని) థాంక్యూ డాడీ!, డాడీ! మీరు రాత్రి ఆలస్యంగా ఎందుకు వస్తారు?

వర్మ ; నేను క్లబ్‌కి వెడుతున్నాను

రాజు ; నేనుకూడా క్లబ్‌కి వస్తాను

వర్మ : నువ్వు క్లబ్‌కివెళ్ళి ఏమి చేస్తావు?

రాజు : నేనూ తాగుతాను.

వర్మ ; (నవ్వి) ఏమిటి?

రాజు : కూల్ డ్రింక్సు. డాడీ! నాతో పేక ఆడుతావా?

(రాజు గదిలో పడి వున్న పేక తెస్తాడు. పేకముక్కలు పంచుతాడు కొన్ని ముక్కలు వర్మ కిస్తాడు. ఇద్దరూ పేక ముక్కలు వేస్తారు.)

వర్మ ; నేనే నెగ్గాను.

రాజు : లేదుడాడీ. నేనే నెగ్గాను. మీరు మోసం చేసారు.

వర్మ : నేను మోసం చేసానా?

రాజు : అవును. (కాకా ఒకచేతిలో పాలగ్లాసు, రెండవ చేతిలో కాఫీ కప్పు తెస్తాడు.

రాజు : కాకా! నాన్న అన్యాయం చేస్తున్నాడు. అన్యాయం చేయడం పాపంకదూ?

కాకా ; అవును? తీసుకో. పాలుతాగు. (కాకా వెళ్ళిపోతాడు)

రాజు : నేను కాఫీతాగుతానూ.

వర్మ : చిన్నపిల్లలు కాఫీ త్రాగకూడదు. పెద్దవాడైన తరువాత త్రాగుదువుగాని.

రాజు ; మీ అంత పెద్దవాడిని అయిన తర్వాతా? (బల్లఎక్కి నిలుచుండి) చూడు ఇపుడునేను పెద్దవాడిని అయిపోయాను మీకంటె పొడుగ్గా ఉన్నాను. ఇద్దరూ నవ్వుతారు. రాజు పాలు, వర్మ కాఫీ త్రాగుతారు. రమ వస్తుంది.)

రమ : నేను భజనకు వెడుతున్నాను.

వర్మ : సరే. కొంతసేపటికి నేను నాభజనకు వెడతాను.

రాజు : మమ్మీ ! నాకేం తెస్తావు ?

రమ : ప్రసాదం.

రాజు : చాకిలెట్టు ప్రసాదంతే.

[illegible] : అలాగే జాగ్రత్త.

రాజు : నేను ఫోను ఎత్తుతాను.

వర్మ : మంచిదీ బాబు, నువ్వే ఎత్తు.

రాజు : (ఫోనులో) హల్లో హల్లో ! మమ్మీ భజనకి వెళ్ళింది. డాడీ కొంచెంసేపటిలో వెడతారు.

వర్మ : మంచిది, ఇప్పుడు నాకు ఇవ్వు. (ఫోను తీసుకొని) వర్మ స్పీకింగ్, చెప్పండి విశేషాలేమిటి ? నేను టూర్‌మీద వెళ్ళాను. నిన్ననే వచ్చాను, మీ పని చెయ్యకపోతే నన్ను బ్రతకనిస్తారా ! ఆఫీసులో ఏమీ బాగాలేదు, తమరు రేపు క్లబ్‌లో కలవండి, ఎందుకుకాదు ? మనలాంటివాళ్ళు ఇద్దరం కలిస్తే

పని చక్కగా అవుతుంది. (చంపత్‌రాయ్ లోపలికి వస్తాడు, మాట్లాడకుండా నిలుచుంటాడు).

చంపత్‌రాయ్ : మీ అనుచరుడు ఇక్కడికికూడ వచ్చాడు.

వర్మ : రండి, చంపత్‌రాయ్‌గారూ రండి. మీరు చాలా కాలం నుండి కనుపించడంలేదు.

చంపత్‌రాయ్ : ఏం చెప్పను ? మెహతాగారి పేరు మీరు వినే వుంటారు.

వర్మ : మెహతాగారా ?

చంపత్‌రాయ్ : ఆ ! మినిస్టరుగారి శక్రటరీ. వారి అమ్మాయికి పెండ్లి, పెండ్లిచూపుల నుండి కట్నానికి ఇచ్చే మోటారు వరకు నేనే కొన్నాను. పెండ్లి ఏర్పాట్లన్నీ నామీదే వదలి వేశారు.

వర్మ : మీకు వారేమైనా బంధువులా ?

చంపత్‌రాయ్ : కాదండి, కాని అన్నింటికంటె ముఖ్యముగా ప్రేమానురాగాలు, అభిమానాలు ఉండాలి. ఎవరితోనైనా నవ్వుతూ మాట్లాడితే, మనం వారికి బానిసలం అవుతాం. అని తెలుసుకోవాలి. అందుచేత ఈ చంపత్‌రాయ్‌ని పొగడితే వెంటనే అక్కడనుండి తప్పుకొని మళ్ళీ ఎప్పుడూ అక్కడికి వెళ్ళడు.

రాజు : (పేకముక్కలు చూపించి) డాడీ ! ఇది చూడు, ఇది జాకీ.

చంపత్‌రాయ్ ! (రాజుతో) అయ్యా ! సలాము.

వర్మ : రాజూ ! వీరికి సమస్కారం చెయ్యి.

చంపత్‌రాయి : (బొమ్మ యిస్తూ) ఇది తీసుకోండి, అబ్బాయి గారూ !

రాజు ! (తల అడ్డంగా త్రిప్పుతూ) వద్దు.

చంపత్‌రాయి : మొదట్లోనే అంత కోపమా ?

రాజు : ఎవరివద్దా ఏమీ పుచ్చుకోవద్దని, మమ్మీ చెప్పింది.

చంపత్‌రాయి : బాబూ ! నేను పరాయివాడ్ని కాదు. నీకు నేను అంకుల్ అవుతాను.

రాజు : మమ్మీకి అంకుల్ అవుతావా ?

చంపత్‌రాయి : కాదు, నీకే.

వర్మ : మంచిది, తీసుకో బాబు.

చంపత్‌రాయి : ఈ రాకెట్టు తీసుకోండి.

వర్మ : ఇది చాలా ఖరీదైన బొమ్మలా ఉందే !

చంపత్‌రాయి : ఎందుకండీ అలా అంటారు, నాకే సిగ్గేస్తోంది. ఖరీదైన వస్తువులు ఇవ్వలేను.

వర్మ : రాజూ ! నీవు వెళ్లి ఈ బొమ్మతో ఆడుకో.

చంపత్‌రాయి : (టేపు రికార్డరు యిస్తూ) తమరు దీన్ని లోపల దాచండి. మా అన్నగారి అబ్బాయి ఇంగ్లండునుంచి తిరిగి వచ్చాడు, అతనిచేత తెప్పించాను.

వర్మ : మీకోసం తెప్పించుకోలేదా?

చంపత్‌రాయి : నాదగ్గర ఒకటుంది. మీ కోసం తెప్పించాను.

వర్మ : నేనేదో సరదాకి అన్నాను, కాని మీరు అనవసరంగా శ్రమపడ్డారు.

చంపత్‌రాయి : నన్ను నమ్మండి, చంపత్‌రాయి ఎప్పుడు కూడ ఏ పనికి కష్టపడడు.

వర్మ : మాటల్లోపడి మర్చిపోయాను, మీరు కాఫీ తీసుకుంటారా, టీయా ?

చంపత్‌రాయి : కాపీ ఐతే ప్రొద్దుట్నించీ త్రాగుతూనేవున్నాను. ఇంకేదైనా ....

వర్మ : అదైతే ఎల్లుండి క్లబ్బులోనే దొరుకుతుంది.

చంపత్‌రాయి ఎల్లుండి ఓ ఓనాలో "లేట్ నైట్ సెషన్" ఉంది, 15 రూ॥లు టిక్కెట్టు. నేను రెండు సీట్లు రిజర్వ్ చేయించాను. "మిస్ అప్లాతూన్" డ్యాన్సు చేస్తుంది.

వర్మ : ఆమె డ్యాన్సులు ఎప్పుడూ పాతబడవు.

చంపత్‌రాయి : అయితే ఎల్లుండి ప్రోగ్రాం ఫిక్సు అయింది, నోట్ చేసుకోండి, మర్చిపోతారేమో.

వర్మ : ఇది మర్చిపోయే విషయమేనా ?

చంపత్‌రాయి : మంచిది, ఇక నేను వెళతాను.

వర్మ : కూర్చోవోయి, వెళ్ళవచ్చు.

చంపత్‌రాయి : నిన్న, ఆ డాలురాం, ఎమ్. పి. సూపర్ బజార్లో కనిపించాడు. ఆర్నెల్లు అయింది అతణ్ణి కలుసుకొని నిన్న

చంద : ఏమిటంటున్నారు?

కాకా : మీకు పిల్లలులేరా! నిరాశపడకండి. భగవంతుడు దయ తలిస్తే....

చంద : నాకింకా పెళ్ళికాలేదు. మీరు ఎవరు?

కాక : నేను ఈ యింటికి పాతసేవకుడ్ని.

చంద : నేను ఇప్పుడే వచ్చి వెళ్ళానని వర్మగారితో చెప్పండి.

కాక : అయన ఈపాటికి వస్తూంటారు. మీరు అమ్మగారికోసం వచ్చారనుకున్నాను. ఆమెభజనకిపాటలువినడాన్కి వెళ్లారు. మీరు కూర్చోండి. అయ్యగారు వస్తూ ఉంటారు. (చంద పత్రిక తీసుకుని చదువుతూంటుంది. కొంచెం సేపట్లో వర్మ వస్తాడు. వర్మ మెల్లిగా వచ్చి చంద కళ్ళు మూస్తాడు. పైన కొక్కాల కిటికీలోంచి రాజు తొంగిచూస్తాడు.)

చంద : ఓడియర్.

వర్మ : చాల త్వరగా గుర్తుపట్టావే!

చంద : నేను శరీరాన్నేమిటిమీనీడపైన గుర్తుపట్టగలను

వర్మ : హూ

చంద : హ

వర్మ : నీవు వచ్చి ఎంతసేపయింది? (చంద మాట్లాడదు) [గట్టిగా]! నీవు వచ్చి ఎంతసేపైందని అడుగుతున్నాను.

చంద : ఏమో తెలియదు.

వర్మ : నీకే తెలియదా?

చంద : మీరు ఏమి అడుగుతున్నారో నాకు తెలియదు.

వర్మ : నేనేమి అడుగుతున్నానా?

చంద : ఏమో నాకేంతెలుసు.

వర్మ : నీవు చాలా సీరియస్‌గా ఉన్నావు! డాక్టర్ని పిలవనా?

చంద : అక్కర్లేదు. నాకు మీమీద కోపం వచ్చింది.

వర్మ : ఎంతకోపం వచ్చింది.

చంద : చాలా వచ్చింది

వర్మ : మీకైతే కోపంరాదే ?

చంద : మీకెలా తెలుసు ?

వర్మ : నువ్వు కోపంలో ఇంకా బాగుంటావు.

చంద : అరే! నాకు కోపంవచ్చిందని మర్చిపోయాను, మాటాడ్డం మొదలుపెట్టాను.

వర్మ : ఎందుకు మర్చిపోయావు ?

చంద : మీరు అమాయకులు పాపం. మీరు 3 రోజుల నుండి క్లబ్బుకి ఎందుకు రాలేదు ?

వర్మ : మా యింటికి బంధువులు వచ్చారు.

చంద : నేను మూడు రోజుల నుంచి అక్కడ రోజూ మీకోసం నిరీక్షిస్తున్నాను.

వర్మ : ఏం, పనేమిటి ?

రమ్మని పట్టుబట్టాడు, వారి శ్రీమతి కూడా నన్ను రమ్మని కబురు పంపింది. ఇద్దరు ముగ్గురు ఎమ్. పి. ల కుటుంబా లతో అతను పిక్నిక్‌కి వెడుతున్నాడట. అంతే పిక్నిక్‌కి రమ్మని బలవంతపెట్టి వస్తానని నాచేత వాగ్దానం చేయించు కున్నారు.

వర్మ : అయితే ఈ వేళ పిక్నికుకి వెళతారన్నమాట

చంపతరాయ్ : పిక్నికు ఏమిటి? చాలా కష్టం వచ్చిపడింది నేను ఎంతో పడుతున్నవాడిని. రోజంతా వాళ్ళతో గడిపితే నా పనులు పోవా? మంచిది వెళతాను (లేచి నిల్చుంటాడు) "సై ది వే" హరిశ్చంద్ర అండ్ కంపెనీ ఎలాగో ఒకలాగ అతన్ని అప్రూవుడు కంట్రాక్టరు లిస్టులోకి తీసుకు రావాలి.

వర్మ : ఏం చేస్తూ వుంటారు ?

చంపతరాయ్ : టెంట్సు తయారు చేస్తుంటారు.

వర్మ : వారి చేత అప్లయి చేయించు

చంపతరాయ్ ; అతనైతే మీ ఆఫీసుకి వచ్చే వుంటాడు. "యూనిట్ కంపెనీ స్ప్రింగు" పాసై ఉండదు,

వర్మ ! అయితే చాలా పాడయిపోయాయి.

చం॥రా॥ : అన్యా! ఏవస్తువు మంచిదీకాదు-చెడ్డదీ కాదు, షేక్స్పియర్ ఏమి చెప్పాడంటే "నతింగ్ ఈజ్ గుడ్ ఆర్ బేడ్ బట్ తింకింగ్ మేక్సు ది సో" అయితే స్ప్రింగులు కొన్ని మంచివి, కొన్ని చెడ్డవి వుంటాయి. కొన్నిటిలో వేగము ఎక్కువ తక్కువ వుంటాయి. అంతే తేడా.

వర్మ : ఆ స్ప్రింగులు ఒక రకమైనవి కావు.

చం॥రా॥ : భగవంతుడే ఒకేరకమైన మనిషిని చేయలేక పోతున్నాడే అటువంటప్పుడు, మిషను ఒకే క్వాలిటీగల స్ప్రింగును ఎలా తయారుచేస్తుంది (యిద్దరూ నవ్వుతారు) ఇంకనేను వెళ్లివస్తాను.

వర్మ : పదండి! నేనూ వెళ్ళాలి.

వర్మ : నువ్వు ఏమి జవాబు చెప్పటం లేదేమిటి?

చంపత్‌రాయ్ : మంచిది. ఆజ్ఞాపించండి (ఇద్దరూ వెళ్ళడానికి లేస్తారు.) మీరు ఎందుకు శ్రమపడతారు?

వర్మ : కష్టమేముంది? నేను కూడ చర్చిరోడ్డుదాకా వెళ్లాలి (కాకా వస్తాడు) నేను ఇప్పుడే వస్తాను (ఇద్దర్నూ వెళ్ళిపోతారు.) (టెలిఫోను గంట మ్రోగుతుంది. టెలిఫోను ఎత్తుతాడు.)

కాకా : (టెలిఫోనులో) అయ్యగారు బయటకు వెళ్లారు. కొంచెం సేపట్లో మళ్ళీఫోను చెయ్యండి. (చంద ప్రవేశించుతుంది.) రామ్‌రామ్.

చంద : రాం రాం

కాకా : మిమ్మల్ని భజనకు రమ్మని అమ్మగారు చెప్పారు

చంద : భజనా మై గాడ్

కాకా : భజన మైగాడ్ కాదు. మీరు కీర్తనలుబాగాపాడతారటగా ఈ వయస్సులో భగవద్భజన అంటే ఇంత ప్రేమ వుండడం చాలా గొప్ప విషయమే. భగవంతునిదయవల్ల మీకుటుంబం మీపిల్లలు ఎప్పుడూ సుఖంగా ఉండాలి.

చంద : మీరు ఎలా మాట్లాడుతున్నాగంటే, నేనేమి పనిలేని దానిలాగ కనిపించుచున్నాను మీముందు. పనేమీ లేంధే మిమ్మల్ని కలుసుకోలే నన్నట్లు.

వర్మ : నా ఉద్దేశ్య మేమంటే .... (వర్మ సిగరెట్టు ప్యాకెట్టు నుంచి సిగరెట్టు తీసుకుంటాడు)

చంద : (అగ్గిపెట్టెతో సిగరెట్టు అంటిస్తుంది) ఒక విషయము చెప్పనా ? ఏమీ అనుకోవుగదా ?

చంద : అనుకోను.

వర్మ : ఎవరితోను చెప్పవుకదా ?

చంద : చెప్పను.

వర్మ : అయితే విను. (చందాదగ్గరకువెళ్ళి, గట్టిగా) నీవు చాలా అందమైనదానవు.

చంద : నాకు బాగా తెలుసు.

వర్మ ; హుం.

చంద : అవును. ఇద్దరూ చిరునవ్వు నవ్వుతారు)

వర్మ : వచ్చేవారం జర్మన్ ఎద్దు వస్తోంది.

చంద ; దానిని తప్పకుండా చూద్దాం.

వర్మ : నేను రెండు టిక్కెట్లు తెప్పిస్తాను.

చంద : (నిష్టురంగా) మీకు ఖర్చు ఎందుకు ? నేను తెప్పిస్తా లెండి.

వర్మ : మీకుమాత్రం ఊరికే వస్తాయా ?

చంద : మా కంపెనీ ఎంటర్టైన్మెంటు ఫండు నుండి తెప్పిస్తాను.

వర్మ : అల్లాగా ?

చంద : అవును. ఇంక మీ ఆఫీసు నుంచి టెంట్సు గురించి ఉత్తరం వచ్చిందికదా ! దానికి జవాబు ఇవ్వవద్దా ?

వర్మ ; అది అయితే ఆడిట్ అభ్యంతరం వచ్చింది. అందుకని వ్రాసివేశాను.

చంద : దానికి జవాబివ్వాలా ?

వర్మ : కంగారేం వుంది, మేము మా ఆఫీసులో అన్ని ఏర్పాట్లు చేస్తున్నామని, తరువాత జవాబు ఇస్తామని వ్రాయి.

చంద : బాగానేవుంది, యీ పని కోసం లాలా నావెంట పడుతున్నాడు.

వర్మ మీరు అతనిని పాపం అంటున్నారు. అతను లక్షల కొలది డబ్బు సంపాదించాడు.

చంద ; అది అయితే నిజమే. అతను జనరల్ మేనేజరుగారి బంధువు.

వర్మ : అయితే ఇంకా మోటుబారిన ఆసామే.

చంద : రేపు నాకు 500 రూ॥లు ఇవ్వడానికి వస్తాడు.

వర్మ : నువ్వే ఉంచుకో.

చంద : ఉంచుకొని ఏమి చేస్తాను ? నేను నాకమీషను వేరే తీసుకుంటాను.

వర్మ : దీనితో ....

చంద : ఇది మొదటి వాటా. తరువాత ఇంతకంటె ఎక్కువ రొఖ్ఖం వసూలుఅవుతుంది.

వర్మ : హుం.

చంద : అవును.

వర్మ : మాటలో మరిచిపోయాను. మీకు అతిథిసత్కారం చేయను వద్దూ.

చంద : నడు గేలార్డులో కాఫీ త్రాగుదాం. నన్ను "కనాట్‌ప్లేసు" వరకు వదలిపెట్టు.

వర్మ : రైట్, మేడమ్. (ఇద్దరూ బయలుదేరుతారు)

వర్మ : (తలుపువద్దకువెళ్ళి) కాకా, కాకా!

కాకా : (వస్తాడు) వస్తున్నానండి.

వర్మ : నేను వీరితోకూడ హాస్పటల్‌వరకు పెడుతాను. ఒకగంటలో వస్తాను. (ఇద్దరూ వెడతారు. కాకా గదిలో అన్నిసర్దుతాడు వెనక్కాలనుండి రాజువచ్చి అతనికళ్ళు మూస్తాడు)

కాకా : రాజూ!

రాజు : రాజూకాదు ఓహో డియర్ అని చెప్పు. (రమవస్తుంది.)

రాజు : డియర్ అంటే ఏమిటీ?

రమ : డియర్ అంటే లేడిని అంటారు.

రాజు : మమ్మీ అంటేనూరి ఆమెడాడీని లేడీ అంటోందా?

రమ : ఎవరు వచ్చారు?

కాకా : ఎవరో చండట. బాబుగారితో ఆమెకు పనుందట.

రాజు : నేను చెప్పనా?

రమ : చెప్పు చూద్దాం!

రాజు : ఆమె ఈ కుర్చీమీదే కూర్చుంది డాడీ వెనక్కాలనుండీ వచ్చి ఆమె కళ్ళుమూశారు

రమ : నువ్వు చూశావా?

రాజు : చూశాను అందుకే చెవుతున్నాను

రమ : తరువాత ఏమైంది?

రాజు : ఆమె చెప్పింది "ఓ డియర్", డియర్ అంటే లేడే కదమ్మా?

రమ : డాడీ చెప్పాడా?

రాజు : చాలా త్వరగా గుర్తుపట్టావే! డాడీ అన్నాడు.

రమ : తరువాత.

రాజు : (ఆలోచించి) జ్ఞాపకంలేదు.

కాకా : ఆవిడను చూస్తే మంచిదిగా అనిపించలేదు. ఆమె బాబుగారికి లంచం ఇచ్చి తన పని చేయించుకుంటోంది.

రమ : ఓరి భగవంతుడా!

కాకా : అమ్మా చూస్తూ వుంటే యీయింటి విషయాలు బాగుండ లేదు. అన్యాయపు సొమ్ము ఎప్పుడు శుభం కలిగించదు.

రమ : ఇద్దరు పిల్లలు మునుపే పుట్టిపోయారు. (రమరాజుని ఎత్తుకొని ముద్దు పెట్టుకుంటుంది.) కాకా ! శర్మగారు రామాయణము అడిగారు. వారికి ఇచ్చిరా (రమరామాయణం తీసుకొచ్చికాకాకి ఇస్తుంది.)

రాజు : నేనూ వస్తాను కాకా, (కాకా, రాజు వెడతారు. రమ లోపలికి వెడుకుంది. ఫోను మ్రోగుతుంది. వర్మ వచ్చి ఫోను ఎత్తుతాడు. రమ ఆగిపోతుంది.)

వర్మ ! (ఫోనులో) నేను వర్మని మాటాడుతున్నాను. మీవని అయిపోతుందిసరే. రేపు క్లబ్బులో కలవండి. (ఫోను పెట్టేస్తాడు.)

రమ : మీరు ఈమధ్య చాలా మారిపోతున్నారు. గమనిస్తూనే ఉన్నాను.

వర్మ : ప్రకృతి నియమము మార్పేగా నదిలో ప్రవహించుతున్న నీరే ఒకానొక సమయములో గట్టుకు తగిలి, కెరటాల దెబ్బలను సహిస్తుంది. చెఱువులో స్థిరముగా నున్న నీటిలో నాచుపడుతుంది.

రమ : నది నీరు కొంత దూరము వెళ్ళిన తరువాత సముద్రములో కలిసిపోతుంది. కాని నది ఎప్పుడు తన చోటులోనే ఉంటుంది.

వర్మ : ఈ రోజు నీవు వేదాంతము మాట్లాడుతున్నావే:

రమ ! ఈ మధ్య మనయింటికి నెల జీతమే కాకుండ, పైసొమ్ము కూడ చాలా వస్తోంది అదంత లంచమేకదా:

వర్మ : కాదు.

రమ : అయితే ఏమిటిమరి?

వర్మ : పై రాబడి

రమ : అది ఎక్కడ నుండి వస్తుంది.

వర్మ : అది పై వాళ్ళు పంపుతారు

రమ : ఇది సంపాదనకాదుగా!

వర్మ : కాకపోతే ఏమిటి?

రమ : ఇది మీరు అమ్ముకున్న ధర్మానికి విలువ. ఇది మీరు వదలుకున్న గౌరవానికి విలువ మిమ్మల్ని ధర్మమార్గము నుండి తప్పించడానికి ఫీజు

వర్మ : ధర్మం, గౌరవము, కర్తవ్యం, ఇవన్ని జీవితంలో కష్ట పడడానికి సాధనాలు. మన కోరికలని అణచుకొనే మార్గాలు డబ్బు ఉంటే అన్ని కోరికలు తీరుతాయి.

రమ : పొరపాటు ఈ డబ్బు మిమ్మల్ని గుడ్డివాడ్నిగా చేస్తుంది. ఫలితంగా మీరు చెయ్యరాని పనులు చేస్తారు. ఆలోచించ రానివి ఆలోచిస్తారు, చూడరానివి చూస్తారు. నాకు అటు వంటి పాపపు డబ్బు అక్కర్లేదు.

వర్మ : ఇంత డబ్బు సంపాదించడంవల్లనే, మన యింటి రూపు రేఖలు మారిపోయాయి. ఈ సోఫా సెట్టు, ఈ తివాసీలు ఈ కర్టెన్సు, నీ ఈ పట్టుచీరలు, నా సూట్లు, ఈ మంచాలు,

ఫ్రిజ్, ఇవన్నీ ఎక్కడనుంచి వచ్చాయి? ఒకప్పుడు మనకు కేవలము రెండువందలు మాత్రమే వచ్చేవి.

రమ : అప్పుడు మనము హాయిగా వుండేవాళ్ళం.

వర్మ : పొరపాటు పడుతున్నావు. మనము ప్రతివస్తువుకి ఇబ్బంది పడేవాళ్ళం తినడానికి, కట్టుకునేందుకు, జీవితానికి సుఖం ఇచ్చే ప్రతీవస్తువుకోసం ఇబ్బంది పడేవాళ్ళం

రమ : కాని మన యింటికి పాపపంకిలం వచ్చేదికాదు. అందుకే మీకు ఈ మంచి ఉద్యోగం దొరకింది.

వర్మ : అందుకే నేను ఈ మంచి ఉద్యోగాన్ని ఇంకా బాగా ఉపయోగించుకుంటున్నాను. నువ్వుమళ్ళీ ఆ జీవితాన్నే గడపాలనుకుంటున్నావా?

రమ : నేనెప్పుడు పట్టుచీరతెమ్మని కోరలేదు. ఇంట్లోకి అవికావాలి ఇవి కావాలి. అని మిమ్మల్ని ఎప్పుడూ వేధించలేదు. ఇంట్లోవున్న యిబ్బందుల్ని గురించే మీకుచెప్పి మిమ్మల్ని కష్టపెట్టలేదు. మిమ్మల్ని విలువయిన వస్తువులు తెమ్మని బలవంతపెట్టలేదు.

వర్మ : అదంతా నీకోరికలను అణచుకునే ప్రయత్నం మాత్రమే

రమ : నాకు అధర్మముగా సంపాదించికొన్న పట్టుచీరఅక్కర్లేదు పాపపు సొమ్ముతో సంపాదించిన పిండివంటలు, పండ్లు అక్కర్లేదు. నాకు నూలుచీరలలోనే ఆనందం వుంది. ఏదో సామాన్యపు భోజనమే చాలు. కష్టపడి సంపాదించని యే వస్తువు నాకు అక్కర్లేదు.

వర్మ : కాని నాకు అలాంటి జీవితం అక్కర్లేదు. నాకు మంచి భోజనం, బట్టలు కావాలి. జీవితాన్ని ఆనందమయం చేసే ప్రతివస్తువు కావాలి. జీవితమంటే వసంతఋతువు లాంటిది. దానిలో నేను సుఖ సంతోషాలను అనుభవించాలని కోరుతు న్నాను. నాకు జీవిత మంటే మధుర సంగీతం. దాని లయ తాళములలో నన్ను నేను మరచిపోతాను. (రమ, వర్మ స్టేజి మధ్యన వుంటారు. స్టేజిమీద చీకటిగా వుంటుంది. గాని వాళ్ళవద్ద చిన్న స్పాటులైటు ఉంటుంది)

రమ : జీవిత మంటే ఒక కర్తవ్యం. ఆ కర్తవ్యాన్ని మనం నిర్వర్తించాలి. చెడ్డపనుల పరిణామం మంచిగా ఉండ దని మరల హెచ్చరిస్తున్నాను.

వర్మ : అదే పొరపాటు. మంచిపనుల పరిణామముకూడ మంచిగ ఉండదు. ఏసుక్రీస్తులో చెడ్డ ఏముందీ ? సోక్రటీసు ఏమి తప్పుచేసాడు ? గాంధీగారు ఏం పాపం చేసారు ?

రమ : నేను యింక వాదించాలని అనుకోవడం లేదు.

వర్మ : అయితే ఎందుకు వాదిస్తున్నావు ?

రమ : కాని నేను స్పష్టంగా చెపుతున్నాను.

వర్మ : ఇంకా చెప్పడానికి ఏమైనా మిగిలిందా ?

రమ : ఇదంతా మీ సంపాదన కాదు.

వర్మ : నా సంపాదన, నా సంపాదన. ఈ సంపాదనంతా నాది కాకపోతే మరి ఎవరి సంపాదన ?

రమ : నేను మన యింటిలోనికి పాపపు సంపాదన రానివ్వను.

వర్మ : అయితే ఈ యిల్లు విడిచి ఎక్కడికైనా ఫో.

రమ : నేను మళ్ళీ చెబుతున్నాను.

వర్మ : (గట్టిగా అరచి) అవతలికి ఫో.

## తృతీయ దృశ్యము

[స్థలం: వర్మగారియింట్లో హాలు]

[కాకా గదిలోని వస్తువులు సర్దుతుంటాడు, ఇంతలో చుట్టన్ వస్తాడు.]

చుట్టన్ : కాకా ! కాకా !

కాకా : ఎవరు ?

చుట్టన్ : నేను మిష్టర్ సి. రామ్‌ని.

కాకా : ఓరి చుట్టన్ నువ్వా ? నువ్వు పేరు కూడ మాన్చేసుకున్నావా ? ఏమిటన్నావు ?

చుట్టన్ : సి. రాం. కాకా ! పేరైతే అదే కాకా. ఇంగ్లీషులో చుట్టన్‌ని సి. రాం అంటారు, మీ అయ్యగారు యింట్లోలేరా!

కాకా : లేరు.

చుట్టన్ : మీ అయ్యగారు చాలా జల్సాపురుషుడులా ఉన్నారే ?

కాకా : ఏమిటి వాగుతున్నావు ?

చుట్టన్ : నేను నిజంచెబుతున్నాను కాకా. మిస్ చందతో ఎన్నో ప్రేమమాటలు మాట్లాడుతారు. వాటిని వర్ణించలేం, చెప్పలేం

కాకా : వళ్ళు దగ్గరపెట్టుకుని మాట్లాడు, నీ ఇంగ్లీషుఅంతా ఎగర గొట్టేస్తాను.

చుట్టన్ : సారీ ! డబుల్ సారీ ! కాకా, ఇంగ్లీషులో సారీ అంటే తప్పు అయింది. బస్, ఇప్పుడు కోప్పడకు కాకా : నేను నీకు శుభవార్త చెప్పాలని వచ్చాను.

కాకా : ఏమి టదీ ?

చుట్టన్ : నా పెండ్లి కాకా.

కాకా : నీకు పెళ్ళా ?

చుట్టన్ : యస్, కాకా.

కాకా : అయితే నీవు మీ ఊరికి పోతావా ?

చుట్టన్ : లేదు కాకా, నేను చదువుకోని పల్లెటూరి పిల్లను పెండ్లి చేసుకొని దానితో కాపురం చెయ్యలేను.

కాకా : పెద్ద, నీకు మాత్రం చదు వేమి వచ్చు.

చుట్టన్ : కాకా ! నిజంగా చెబుతున్నాను, ఈ ఆరు నెలల నుండి ఇంగ్లీషు అంతా నేర్చేసుకున్నాను. ఇప్పుడు నేను నోరు విప్పితే ఇంగ్లీషు దానంతట అదే వచ్చి పడుతుంది.

కాకా ; పిల్లబాగా చదువుకొందా ?

చుట్టన్ : బాగా చదువుకుంది. నాలుగు క్లాసులు పాసైంది. 5వ కాసు ఫేలయింది. ఇదిగో ఆమె ఫోటో చూడు.

కాకా : అబ్బా! చాలా బాగుందే !

చుట్టన్ : బాగుందేమిటి ? "వెరీగుడ్" అని చెప్పు కాకా.

కాకా : పెళ్ళి ఎప్పుడు ?

చుట్టన్ : ఇప్పుడే "పెటిల్" అంటే తెలుగులో నిశ్చయమైంది. వచ్చే నెలలో 12వ తారీఖున పెళ్ళి.

కాకా : మీ అత్తవారిల్లు ఎక్కడ ?

చుట్టన్ : ఇక్కడే, [illegible]. [illegible] జిల్లాలో ఉంటున్నారు. కాకా, [illegible] పెండ్లికి రెడీగా వుండు. పెండ్లి ఊ[illegible] రావాలి.

కాకా: మంచిది [illegible]స్తాను.

చుట్టన్ ; నో నో ఎందుకి ఊరేగింపుకి నువ్వు రాకపోతే ఎవరు వస్తారు. నేను 12 మందితో బ్యాండుమేళం పెట్టాను వాళ్ళందరూ ఇంగ్లీషు యూనిఫారం వేసుకోవాలని ఖచ్చితంగా చెప్పారు. అంతే తప్పదు కాకా, నీవు కూడా పెండ్లి ఊరేగింపుకి రెడీగా వుండు.

కాకా : నాకు రెడీ అవడానికి ఏముందిలే

చుట్టన్ : కాకా, నీ కోసం ఒక మంచి కోటు, పైజమా తెప్పి యిస్తాను,

కాకా : వద్దు నాకు ఎవరి బట్టలు వద్దు.

చుట్టన్ ; కాకా నా దోస్తు డ్రైయ్ క్లీనర్ షాపులో పనిచేస్తున్నాడు అతని వద్ద వందలకొలది కోట్లు, పంట్లాలు పడివుంటాయి. పెండ్లి వారికి ఒకటి, రెండు కోట్లు పట్టుకెళ్ళమని చెప్పాడు. వాడు నాకు సూటు తెస్తానన్నాడు. అప్పుడు నేను మీ అయ్యగారిలా కనిపించుతాను.

కాకా : ఉతకడానికి వచ్చే బట్టలలో నుంచి ఇస్తాడనుకుంటాను.

చుట్టన్ : కాకా, అతనికిచ్చికదానిత్తర్వాత ఒకదుస్తు అలాదుస్తులు వస్తూనే ఉంటాయి. చూడు, ఈ కోటు కూడ అక్కడినుంచే తెచ్చాను. కాకా, ఒక గ్లాసుడు మంచినీళ్ళు యివ్వవూ? (మంచినీళ్ళు తేవడాన్కి కాకా లోపలికి వెడతాడు. లాలా ఝుంగూరప్రసాదు ప్రవేశించుతాడు. ఆయన చుట్టన్‌కోటు వైపు దీక్షగా చూస్తాడు. చుట్టన్ కంగారు పడతాడు.)

ఝుం.ప్ర : ఈ కోటు నీదా ?

చుట్టన్ : నాదే

ఝుం.ప్ర : ఈ కోటు మాఅబ్బాయిది. డ్రైక్లీన్‌కి ఇచ్చాను.

చుట్టన్ : (కంగారుగా) కాదు. ఇది నాదే. (చుట్టన్ గదిలోనే యిటు అటు పరుగెత్తుతాడు. కొంచెము సేపటిలో కాకా మంచినీళ్ళ గ్లాసు తెస్తాడు. చుట్టన్ తొందరగా బయటకు వెళ్ళడానికి దుముకుతాడు.)

కాకా : చుట్టన్, మంచినీళ్ళు తీసుకో

చుట్టన్ : తర్వాత త్రాగుతానులే. (చుట్టన్ బయటకు పారి పోతాడు. కాకా గ్లాసు పెట్టడానికి లోపలికి వెడతాడు)

ఝుం, ప్ర : వర్మగారూ! వర్మగారూ! (కాకా లోపలి నుండి వస్తాడు.) (లాలాని కోపంగా చూస్తాడు) (లాలా కొంచెం భయపడుతూ వెనక్కి తప్పుకుంటాడు.)

కాకా : మళ్ళీ వచ్చారూ? మీరూ.

ఝుం, ప్ర : కాకాజీ, నా అంతట నేను రాలేను. చెప్పేదేముంది? అయ్యగారు నన్ను పిలిపించారు.

కాకా : సంచులు, బుట్టలూ ఏమీ తేలేదుగదా?

ఝుం, ప్ర : ఏమీ తేలేను. అయ్యగారు కబురు పంపారు. అంతే వచ్చేశాను.

కాకా : బాబుగారు పిలిచారా!

ఝుం, ప్ర : ఆయనే పిలిచారు. ఒట్టుపెట్టుకొని చెపుతున్నాను వారే పిలిచారు. నేను సత్యం చెపుతున్నాను.

కాకా : అయితే కూర్చోండి. బాబుగారు ఇప్పుడే వస్తారు.

ఝుం, ప్ర : కాకాజీ మహాశయా?

కాకా : చెప్పండి (లాలా కాకా జేబులో వదిరూపాయల నోటు పెడతాడు)

కాకా : ఇదేమిటి?

ఝుం, ప్ర : ఏమీలేదు

కాకా : పదిరూపాయల నోటు

ఝుం,ప్ర : ఇప్పుడైతే పదిరూపాయల నోటే

కాకా : ఇది నాకెందు కిచ్చారు?

ఝుం, ప్ర : మీకు అది బహుమానం.

కాకా : నాకెందుకు బహుమానం?

ఝుం, ప్ర ఇది ఉంచుకోండి.

కాకా : ఎక్కడ ఉంచను?

ఝుం, ప్ర : సంచిలో దాచుకోండి.

కాకా : నావద్ద సంచిలేదే.

ఝుం, ప్ర : దీనిని జేబులో ఉంచుకోండి.

కాకా : నాకు జేబులేదు.

ఝుం, ప్ర : అయితే దీనిని మూట కట్టుకొని ఉంచుకోండి.

కాకా : నేను అన్యాయపు సొమ్ము తీసుకోను. మళ్ళీ నీవు ఏదో హడావిడి చెయ్యడానిక్కి వచ్చినట్లున్నావే?

ఝుం, ప్ర : నువ్వు ఊరికేనే కోప్పడుతున్నావు. (వర్మవస్తాడు)

వర్మ : చెప్పండి లాలాగారు?

ఝుం, ప్ర : జైరాం అయ్యగారూ.

వర్మ : కాకా, రమ ఇంట్లో ఉందా!

కాకా : లేరండి. అమ్మగారు రాజు స్కూలుకి వెళ్ళారు (లాలా భయంగా నిలుచుంటాడు)

వర్మ ; కాకా . ఈ ఉత్తరం పోస్టులో వేసిరా.

కాకా : సరేనండి (కాకా వెడతాడు)

వర్మ : కాకాతో ఏమిటి మాట్లాడుతున్నారు.

జం, ప్ర : ఏమిలేదు. నేను కాకాకి బహుమతి ఇస్తున్నాను.

వర్మ : కాకా బహుమతికంటె ధర్మాన్ని ఎక్కువగా గౌరవిస్తాడు. ఇంకెప్పుడు అతనితో అటువంటి మాటలు మాట్లాడకండి.

జం॥ ప్ర॥ : వర్మగారూ! అమ్మగారు ఇంట్లో ఉన్నారేమో ఒకసారి చూడండి.

వర్మ : ఆడవాళ్ళు ఎక్కువ చాదస్తంగా పుణ్యకార్యాల్ని మీకన్న తెలిసే ఉంటుంది. వారికి పాపపుణ్యాలు అంటే శ్రద్ధ ఎక్కువ. డబ్బుఎలా సంపాదించాలో వారికేం తెలుసు.

జం॥ ప్ర॥ : మీరు చెప్పేది నిజమే. మంచిది. మన వ్యవహారమేమయింది?

వర్మ : అసలు విషయమేమిటంటే ఎవరికయినా నష్టంవస్తే నా మనస్సు బాధపడుతుంది. మీ సామాను చాలా పాడైంది. మా ఆఫీసుకు ఇచ్చిన నమూనాలాగ సామాను అంతాలేదు.

జం॥ ప్ర॥ ; ఏదో కొంచెం తేడా ఉంటుంది. మన చేతివేళ్ళు ఐదు సమానంగా ఉంటాయా మరి.

వర్మ : కాని అన్ని వేళ్ళగోళ్ళు సమానంగా వుంటాయి.

జం॥ ప్ర॥ : అంతా మీ పెన్నులో వుంది. మీరు తలిస్తే ఏదయినా చేయువచ్చును.

వర్మ : లాలాజీ! మైనము కరగించడానికికూడ నిప్పుకావాలి. నీరు ప్రవహించడానికికూడ గట్టుకావాలి.

జం॥ ప్ర॥ : మీ అభిప్రాయమేమిటి?

వర్మ : ఏముంది? కలమునడవదు నడిపించాలి.

జం॥ ప్ర॥ : మీరు చెప్పింది చేస్తాను. మీకు ఏ రకమయిన సేవ చెయ్యడాన్కి అయినా సిద్ధంగా వున్నాను. నేను ముందే వచ్చాను. కాని అమ్మగారు నన్ను తోలేశారు. ఆ భయంచేత మళ్ళీ రాలేకపోయాను.

వర్మ : పళ్ళబుట్ట, చీర యిచ్చినంత మాత్రాన పనులౌతాయను కున్నారా? కష్టమయినపనులు అంత సులభంగా జరుగవు. ఇది సామాన్యమైన విషయంకాదు.

జం॥ ప్ర॥ : అవి ఊరికే సరదాగా తెచ్చాను.

వర్మ : మీకు ఈ ఐటంలో ఎంతడబ్బు మిగిలింది?

జం॥ ప్ర॥ : మిగలడానికి ఏముంది?

వర్మ : దీనిలో మీకు కనీసం లక్షయినా మిగులుతుంది.

ఝు. ప్ర : రాం రాం యింత ఎక్కడ మిగులుతుందండి.

వర్మ : ఈ సామాను విడుదల కాకపోతేనో?

ఝు. ప్ర : ఏదో రకంగా ఖర్చు పెట్టేస్తాను

వర్మ : అప్పుడుమీకు కనీసం లక్షరూపాయలన్నా నష్టంవస్తుంది.

ఝు. ప్ర : నేను పూర్తిగా మునిగిపోతాను. సర్వనాశనము అవుతాను

వర్మ : మీకు ఏమీ సర్వనాశనం అవదు

ఝ ప్ర : మీరు నాల్గు అక్షరాలు రాసివడిస్తే నేను బ్రతికి బయట పడతాను

వర్మ : అయితే మీ పని అయిపోతుంది

ఝ. ప్ర : భగవంతుడు మీకు మేలు చేయుగాక నేను మీకు ఏ విధమైన సేవచేయాలి. చెప్పండి.

వర్మ : నేను కారు బేరం చేస్తున్నాను. ధాదాపు 50 వేల పైన చెవుతున్నారు

జ ప్ర : 50 వేలే

వర్మ ; ఈ రోజుల్లో కాడు బ్లాకులో కాని దొరకదు. మీకు తెలియనిదేముంది

జ. ప్ర : ఏదో బీదవాడ్ని నాకేం తెలుసు?

వర్మ : (వ్యంగ్యంగా) నాకు తెలుసునులెండి

జ, ప్ర : కొంచెం తగ్గించండి, యింత సొమ్ము యిచ్చుకోలేను.

వర్మ : మంచిది ఐతే మీరు 40 వేలకే ఇచ్చేఏర్పాటు చేయండి మిగిలినది నేను వేసుకొంటాను.

జ. ప్ర : [యిద్దరూ నవ్వుకుంటారు] నా పని అయిపోతుంది యింక.

వర్మ : ఓ తప్పకుండా అయిపోతుంది

జ. ప్ర : అయితే రొక్కం యిప్పుడే యిచ్చి వెళ్లిపోతాను

వర్మ : నేను మీకు ఫోను చేస్తాను మిరు డబ్బు కారు వాడికే ఇచ్చే సెయ్యండి మధ్య నాకెందుకు?

జ. ప్ర ; నేను రెండు మూడు రోజులలో ఆఫీసుకి వస్తాను

వర్మ : నేను ఆఫీసునుంచి ఉత్తరం పంపిస్తాను అప్పుడురండి.

జం॥ ప్ర॥ : జై రాంజీకి.

వర్మ : జై రాంజీకి. (కొంచెం సేపయిన తరువాత రమ, రాజు వస్తారు)

రాజు : డాడీ.

వర్మ ; రాజూ! (రమతో) రాజుతో స్కూలుకి వెళ్ళావా?

రమ : అవును వెళ్లాను. స్కూలుఫీజుకట్టి వచ్చాను. మొత్తం 110 రూ॥లు అయింది.

వర్మ : 10 రూ॥లు బస్సుకోసం అయి వుంటాయి.

రమ : స్కూలు మంచిదే. పిల్లల్ని చాలా జాగ్రత్తగా చూస్తారు.

వర్మ : రాజూ మీ మేడమ్ తెల్లగా ఉంటుందా, నల్లగా ఉంటుందా?

రాజు : నా మేడమ్ చాలా మంచిది. మమ్మీలాగే తెల్లగా ఉంటుంది

వర్మ : మంచిది రాజు, నీబ్యాగ్ లోపల పెట్టుకొనిరా.
(రాజు బ్యాగ్ తీసుకొని లోపలికి పెడతాడు. వర్మ రమని చూస్తాడు)

రమ : అలా చూస్తున్నారేమిటి?

వర్మ : నీవు ఎంత తెల్లగా ఉన్నావో అని చూస్తున్నాను.

రమ : రంగులో ఏముంది ? మనిషికి మనస్సు స్వచ్ఛంగా పవిత్రంగా ఉండాలి.

వర్మ : (కోపంగా) నీవు ప్రతిమాటకి ఉపన్యాసం దంచేస్తున్నావు. ఈ మధ్య నువ్వు ఆదోలా ఉంటున్నావు మంచిది. నేను వెడుతున్నాను.

రమ : ఇదిగో చూడండి

వర్మ : ఏమిటి ?

రమ : కోపమొచ్చిందేమిటి ? (రాజు వస్తాడు.)

రాజు : మమ్మీ ! నాకు పుస్తకములు తెచ్చిపెట్టివా ?

రమ : రీడర్ నెం. 1 తెండి.

వర్మ : రేపు ఎనిమిది పుస్తకాలు తెస్తాను.

రమ : అబ్బో ? ఎనిమిదే !

వర్మ : వారంలో కనీసం ఒక్క పుస్తకమైనా చిరిగిపోతుంది. నేను వీణ్ణి ఇంజనీరు చదివిస్తాను.

రమ : వద్దు నా రాజు డాక్టరు అవుతాడు.

వర్మ : (రాజుతో) సరే వెళ్ళు డాక్టరు చదువు. నువ్వు డాక్టరు అయ్యాక అమ్మకి సదుపాయం చేసి కష్టాలు పోగొట్టాలి.

రమ : (రాజుతో) నీవు ఇంజనీరింగే చదివి, ఇంజనీరువై నీ డాడీ బుర్రలో ఉన్న యంత్రాన్ని రిపేర్ చెయ్యి. (రమ, వర్మ ఇద్దరూ నవ్వుకుంటారు)

రాజు : నేను ఆడుకునేందుకు వెళుతున్నా.

రమ : బయుట రోడ్డు మీదకి వెళ్ళవద్దు వెళ్ళి గార్డెన్‌లో ఆడుకో.
(రాజు గార్డెన్ వేపు వెళతాడు)

వర్మ : ఒక కారు తీసుకుందామనుకుంటున్నాను. నీ ఉద్దేశ మేమిటి ?

రమ : (ఆశ్చర్యంగా) కారా !

వర్మ : అవును.

రమ : కారు తీసుకొని ఏం చేస్తాం

వర్మ : షికారుకి వెళతాం హాయిగా, సరదాగా తిరుగుతాం,

రమ : కారు తీసుకునేందుకు యింత డబ్బు ఎక్కడ్నించివస్తుంది ముందు మీరు నాకి విషయము చెప్పండి బ్యాంకులో 10,000 దాకా ఉంది.

వర్మ : కారుకి ఆఫీసు ఇస్తుంది.

రమ : డబ్బు ఉన్నప్పుడే కారు తీసుకోవచ్చు. లోన్ తీసుకుని కొనడందేనికి?

వర్మ : డబ్బు ఉన్నప్పటికి కూడ లోన్ ఎలాగా తీసుకోవలసి వస్తుంది.

రమ : అదెందుకు ?

వర్మ : మా ఆఫీసే అటువంటిది. నేను "లోన్" తీసుకోకపోతే ఈ డబ్బంతా లంచంగా తీసుకున్నానని అనుకుంటారు.

రమ : మీరు ఈ మధ్య లంచం తీసుకోవడం లేదుకదా !

వర్మ : అసలు తీసుకోవడంలేదు.

రమ : మీరు చాలా మంచివారు.

వర్మ : హు

రమ : అవును.

వర్మ : మంచిది. నేనలా వెళ్ళొస్తాను.

రమ : ఎన్ని గంటలకు వస్తారు ?

వర్మ : ఎనిమిది లోపల వస్తాను.

(కాకా పూలగుత్తి తీసుకొని వస్తాడు)

కాకా : ఆ సెట్టి ఇవ్వాళ్ళ మళ్ళీ వచ్చాడు.

రమ : ఏ సెట్టి ?

కాకా : వాడే మొన్న పళ్ళబుట్ట తెచ్చాడూ వాడే.

రమ : ఇవ్వాళ కూడా ఏదైనా తెచ్చాడా ?

కాకా : బాబుగారు ఇవ్వాళ రమ్మని కబురు పంపారనిచెప్పాడు.

రమ : వారే పిలిపించారా ?

కాకా : అవును.

రమ : ఏమంటున్నాడు ?

కాకా : నాకు పదిరూపాయలు యివ్వబోయాడు.

రమ : ఎందుకోసం యివ్వబోయాడు ?

కాకా : ఊరికేనే. బాబుగారిచేత పని చేయించిపెడతానని నేను అన్యాయమైన డబ్బు తీసుకోనని స్పష్టంగా చెప్పేశాను.

రమ : మంచి పని చేశావు. అయ్యగారితో ఏం మాట్లాడాడు ?
కాకా : నేను ఉత్తరం పోష్టు వేయడానికి బయటకు వెళ్లాను.
రమ : వాడు తప్పకుండ లంచం యివ్వడానికే వచ్చి ఉంటాడు. ఓరి భగవంతుడా !

(రమ లోపలకు వెళ్ళిపోతుంది. కాకా ఫ్లవర్‌వాజ్‌లో పూలు మారుస్తాడు. తెరలో పెద్దవర్షం.గాలి వస్తున్నట్లు ధ్వని వినిపిస్తుంది. రమ కంగారుగా పరుగెత్తుకుంటూ వస్తుంది.)

రమ : కాకా ! పెద్ద వర్షం వస్తోంది. రాజు ఎక్కడ ఉన్నాడు ?
కాకా : ఇప్పుడే వెళ్ళి రాజుని తీసుకుని వస్తాను. (కాకా బయటికి వెడతాడు రమ అతని వెనకే వెడుతుంది చాలా తీవ్రంగా తుఫాను గాలి వస్తోంది మెఱుపులు మెఱుస్తున్నాయి తెరలో, కాకా, రమ, రాజుని పిలుస్తారు.)
రమ : [ఆదుర్దాగా] కాకా రాజుకి ఏమయింది ?
కాకా : స్పృహతప్పిపడిపోయాడు
రమ : కాకాజుని త్వరగా తీసుకొనిరా వెళ్ళు కాకా [రాజుని ఎత్తుకొని తోటవైపు నుంచి లోపలకు వస్తాడు. ఆతనితో కూడా రమ వుంటుంది కొంచెం సేపు స్టేజి మీద చీకటిగా ఉంటుంది. మళ్ళీ వెలుతురు కనిపిస్తుంది]
వర్మ : [ఫోనులో] డాక్టరుగారూ ! రాజుకి యింకా జ్వరం తగ్గలేదండి. రాత్రంతా రెస్ట్‌లెస్‌గా వున్నాడు. ఆ అవును మీరు యిచ్చిన మాత్రవేసాను. ఆ అవునండీ – అవునండి– చాలా మంచిది [రమ ప్రవేశిస్తుంది]

వర్మ : ఆ పచ్చని మాత్రలు వేసావా ?

రమ : ఆ వేసాను

వర్మ : ఎక్కడికి వెళుతున్నావు

రమ : దేవాలయానికి

వర్మ : [ఆశ్చర్యంగా] దేవాలయానికా ?

రమ : నేనక్కడ రాజుపేర పూజచేయించాలని అనుకుంటున్నాను

వర్మ : పూజ వల్ల యేమౌతుంది ?

రమ : మందువల్ల కానిది పూజవల్ల అవుతుంది.

వర్మ : చూడు, మనం రాజుకి బొంబాయి తీసుకువెళదాం. అక్కడ పెద్దపెద్ద డాక్టర్లు వున్నారు. చాలా మంచి వైద్యం చేయించవచ్చు

రమ : వైద్యానికేం లోటు అప్పుడు మన యిద్దరబ్బాయిలకు యిలాగే చేయించాం. పెద్దపెద్ద డాక్టర్లకే చూపించాము. ఎంతో విలువైన మందులు యిప్పించాం. కాని ఏం లాభం

కాకా : అయితే ఏం చెయ్యమంటావు ?

రమ : మనపిల్లల జబ్బేమిటో, డాక్టర్లకు ఎందుకు అర్థం కావడం లేదో వేసేమందు ఎందుకు పనిచేయుడంలేదో, ఈ విషయాల గురించి ఎప్పుడయినా ఆలోచించారా?

వర్మ : నాకేం తెలుసు?

రమ : మన యింట్లోకి విషంవస్తోంది. అదే దీనికి కారణం.

వర్మ : అసలు నీ వుద్దేశ్యమేమిటి?

రమ : మీరు తెచ్చే డబ్బంతా అన్యాయంగా, బలవంతంగా సంపాదించే డబ్బే. లంచంతీసుకుని సంపాదిస్తున్నారు

వర్మ : నేనెవరిసొమ్ము అన్యాయంగా దొంగిలించడం లేదే!

రమ : మీకు వాళ్ళు డబ్బెందుకు ఇస్తున్నారో తెలుసా? తాము చేసే అన్యాయాలకు, అక్రమాలకు మీ సహాయం అవసరం కనుక. ఈ అన్యాయాలకు, అక్రమాలకు గురియైన ప్రజలు మిమ్మల్ని శపిస్తున్నారు. తమ దురదృష్టానికి మీలాంటి వాళ్ళవల్ల సంఘం దోషిగా నిలబడుతోంది.

వర్మ : నీవు కోడిగ్రుడ్డుకి ఈకలు లాగుతున్నావు.

రమ : అటువంటిడబ్బు మనకు జయింకాదని చెబుతున్నాను. నష్టపడినవాళ్ళ ఉసురు మనకు తగులుతుంది.

వర్మ : నీదంతా భ్రమ. నేను డబ్బు తీసుకోవడంవల్ల ఎవరికి ఏ నష్టం కలుగదు. నేను గొప్పవాళ్ళదగ్గరే డబ్బుతీసుకుంటూ (స్టేజిమీద కొంచెంలైటు ఉంటుంది. రమమీద స్పాట్‌లైట్ పడుతుంది.)

రమ : దాని పరిణామం బీదవాళ్ళు అనుభవించవలసి వస్తుంది. ఆ కష్టనష్టాలకు వారు గురి అవుతున్నారు, కొంచెం ఆలోచించుకోండి. మీరు "పాస్" చేసిన "టెంట్స్" సరిగాలేవు. ఈ టెంట్స్‌లో పాపం వెనకబడ్డజాతివాళ్ళు ఉంటారు. నిరాశ్రయులయినవారు ఆశ్రయం వీటిలో పొందుతారు.

ఇల్లులేనివారు ఈ ఇళ్ళల్లో నివసిస్తారు. దురదృష్టవశాత్తు వారు ఈ లంచం తీసుకొని "పాస్" చేసిన యిళ్ళల్లో ఉంటారు. ఈ ఇళ్ళు వర్షాన్ని కాని ఎండనుకాని ఆపవు. వర్షాకాలంలో వర్షము తలమీద కురుస్తుంది. వాళ్ళంతా బాధ పడతారు. వారి పిల్లలు ఈ చలిని భరించలేక ప్రాణాలు పోగొట్టుకుంటారు. వారి తల్లులు ఈ దృశ్యం చూడలేక కుమిలిపోతూ వుంటారు. మీ లంచపు డబ్బు గలగలలో వారి ఆర్తనాదలు నిండి ఉంటాయి. ఈ రూపాయల మెఱుపులో అనాధుల కన్నీళ్లు మెరుస్తూ తళతళ లాడుతుంటాయి.

వర్మ : ఇదంతా నీవాదస్తం.

రమ : కాదు. ఇటువంటి సొమ్ముతో కొన్నమందులు రాజుకి ఎప్పుడూ పనిచెయ్యవు. సరే మీకు యివన్నీ ఎందుకు ? మీకు డబ్బు కావాలి. మీకు డబ్బే సర్వస్వం. మీరు స్వయముగా యిద్దరు పిల్లల్ని చంపేశారు. వాళ్ళ వైద్యం కూడ యిటువంటి డబ్బుతోటే చేయించారు. నాకు ఇక్కడ స్థిమితంగా లేదు. నాకు యిక్కడ ఊపిరి సలపడంలేదు. ఈ విషం నన్ను చంపేస్తోంది. నన్నేకాదు, రాజుని కూడాచంపేస్తుంది. మన సంసారాన్ని నాశనం చేస్తుంది. అప్పుడుమీరు ఈ నోట్ల కుప్పమీద ఒంటరిగా కూర్చోండి. ఒకటి మాత్రం గుర్తుంచుకోండి. నాచితి మాత్రం యీపాపపు సొమ్ముతో కాల్చవద్దు. (బయటకు వెళ్ళిపోతుంది.) (వర్మ కొంచెంసేపు ఆలోచిస్తాడు. తర్వాత సోఫాలో కూర్చుంటాడు.)

కాకా : అమ్మగారు ఎక్కడికి వెళ్లారు?

వర్మ : దేవాలయానికి.

కాకా : అమ్మగారు దేవాలయానికి వెళ్ళలేదు

వర్మ : అయితే ఎక్కడికి వెళ్ళింది ?

కాకా : అమ్మగారు తమ గొలుసు అమ్మడానికి వెళ్ళారు.

వర్మ : ఏమంటున్నావు, కాకా

కాకా : మీరు పెళ్ళిలో యిచ్చిన బంగారం అమ్మడానికి వెళ్ళారు. ఆ గొలుసు మీరు స్వయముగా కష్టపడి సంపాదించినదట.

వర్మ : కాకా! నువ్వే చెప్పు. వైద్యానికి డబ్బుకి సంబంధమేముంది ? ప్రపంచంలో అందరూ తమ పిల్లలకి తమ స్వార్జితంతోనే వైద్యం చేయిస్తున్నారా ? గొప్పగొప్ప సాహుకార్ల పిల్లలకి జ్వరంవస్తే తగ్గడం లేదా ?

కాకా : ప్రపంచంలో దొంగలు, దోపిడీగాళ్ళు, హంతకులు బాగా వున్నారు. విషపు చెట్టుకూడా పూలుపూచి కాయులుకాస్తుంది. అది కూడా బాగా అభివృద్ధి చెందుతుంది. ప్రపంచంలో నాలాగ కొద్ది సంపాదనతోనే తృప్తిగాను సంతోషంగాను వుండేవారున్నారు. అమ్మగారు బాగానే చెప్పారు ఏమంటే

వర్మ : ఇదంతా ఆమె గుడ్డి నమ్మకం. ఇదంతా ఆమె చాదస్తం.

కాకా : సరే చాదస్తమే అనుకోండి, మీరు కూడ ఆచాదస్తంలో పడచ్చుగా. అమ్మగారు మిమ్మల్నేమీ కావాలని అడగరు,

ఆమెకు కోరికలే లేవు, ఏ వస్తువూ కొని తెమ్మని పట్టుబట్టరు ధర్మంగా, న్యాయంగా, తృప్తిగా జీవించాలని అంటారు. అధర్మంగా డబ్బు సంపాదిస్తే ఆమె సహించలేరు. నేను నలుబది ఏళ్ళనుంచి మీ వుప్పు తింటున్నాను. మీకు ఋణ పడి వున్నాను. నేను చూస్తూవుండగానే యిద్దరు పిల్లలు చచ్చిపోయారు.
ఎవరి శాపమో ఎవరివుసురో తెలియడంలేదు. ఎవరుమనల్ని గురించి బాధపడుతున్నారో ? ఎవరి ఉసురో ? భగవంతుడు రాజు ఆరోగ్యం తొందరగాకుదుటబడేట్టు చెయ్యాలి(కన్నీరు తుడుచుకుంటూ వెళ్ళిపోతాడు.)

(వర్మ ఆలోచించడం ప్రారంభించుతాడు. కాకామాటలు అతని చెవిలో గింగురు మంటూ ఉంటాయి.నేనుచూస్తుండ గానే ఇద్దరు పిల్లలు చనిపోయారు. ఇది ఎవరి శాపమో తెలియదు. ఇది ఎవరి బాధో తెలియదు. దీని తరువాత రాజుమాటలు వినుపించుతాయి. "డాడీ ! నీవు అధర్మపరు డవు. చివరకు అతనికి రమ మాటలు వినిపించుతాయి. ఈ విషం ఈ యింటిని నాశనం చేస్తుంది. అప్పుడుమీరు నోట్ల మీద వంటరిగా కూర్చోండి. వీట్లతోటే ఆడుకొని వీటినే తినండి. కాని నాచితి మాత్రం యీపాపిష్టి సంపాదనతో కాల్చవద్దు. వర్మ ఇటుఅటు వ్యాకులతతో తిరుగుతాడు మళ్ళీ కూర్చుంటాడు. ఫోను గంట మ్రోగుతుంది.)

వర్మ : (ఫోనులో) అవునండి చెప్పండి. నేనే వర్మను మాట్లాడు తున్నాను. మీరు ఆఫీసులో కలుసుకోవచ్చును. కాని ఆపని

జరగదు. వ్యాపారస్థుల్ని నేను యింట్లో కలుసుకోను. మూడువేలేమిటి, ముప్పైవేలేమిటి 30 లక్షలు ఇచ్చినప్పటికి లాభంలేదు.

(చంపత్‌రాయ్ ప్రవేశిస్తాడు.)

చంపత్‌రాయ్ : వ్యాపారస్థుల్ని ఇంట్లో కలుసుకొనే బాధ్యత నాకు అప్పచెప్పండి. చూడండి, భగవంతుడు మేలు చేస్తే మీకు ముప్పైవేలేమిటి? ముప్పై లక్షల డబ్బు కురిపించుతాను.

వర్మ : రండి చంపత్‌రాయ్‌గారూ.

చం॥ రా : నిన్న మీరు క్లబ్‌కి రాలేదేం?

వర్మ : నేను క్లబ్‌కి వెళ్లి వారమైంది.

చం॥ రా : నేను నిన్న ప్రొద్దుటే బొంబాయి నుంచి వచ్చాను నా స్నేహితుడొకడు ఒక ఫిల్మ్ తీస్తున్నాడు. అతను మహూర్తము పెట్టుకున్నాడు. నేను తప్పించుకుంటూ వచ్చాను. వింటేనా? ఒకరోజు ఉందామని వెళ్ళాను. కాని ఎనిమిదిరోజులు పట్టింది. ఒక హీరోయిన్ మూడు లక్షలు అడుగుతోంది. నేను చెప్పడంవల్ల ఒక లక్ష తగ్గింది.

వర్మ : అయితే మీకు సినీమా నటీనటులతో కూడ పరిచయం ఉందన్నమాట.

చం॥ రా : నాకు చాలామందితో పరిచయం వుంది. ఈ ప్రపంచంలో అందర్నిని కలుసుకోవాలి ఏమో ఏవేషములో నారా

యుఁడు దర్శనమిస్తాడో" అని తులసీదాసుచెప్పినదిసత్యం
రేపు మిస్ అఫలాతూన్ డ్యాన్సు జరుగుతుంది మీరు వస్తా
నంటే రెండు టిక్కట్లు తెప్పించుతాను

వర్మ : నాకు డాన్సులన్నీ పాతపడ్డాయి

చం॥ రా : మీరు చూస్తే మీ మనస్సుకు ఎంతో ఉత్సాహము
వస్తుంది

వర్మ : నామనస్సు డాన్సులతో విసిగిపోయింది

చం॥ రా : ఎప్పటి నుంచీ ?

వర్మ : ఈ రోజు నుంచే

చం॥ రా : ఈ రోజు మీరు ఏ డ్యాన్సూ చూడలేదుగా !

వర్మ : ఈ రోజు ఒక గొప్ప నృత్యం చూశాను.అది నానాట్యమే
ఈ రోజువరకూ నేను రూపాయల ధ్వనే వింటూ వచ్చాను.
రూపాయల చప్పుడే తాళం. ప్రజలు భేష్, భేష్, అంటూ
ఉంటే ఆ గందరగోళంలో నాఅంతరాత్మ మాట వినలేక
పోయాను. కాని నేనింకా నాట్యం చేయలేను. నేను అలసి
పోయాను ఇంక నేను పడిపోతాను. (ఫోను గంట మ్రోగు
తుంది.)

వర్మ : (ఫోనులో) సరే మంచిది. మీకు ఆఫీసులోనే జవాబు
దొరుకుతుంది. నన్ను కలుసుకుంటే లాభంలేదు

చంపత్‌రాయ్ : మీరు చిన్నవాళ్ళతో మాట్లాడక్కరలేదు. మిమ్మ
ల్ని ఇంటిలో కలిసేవారిని నాకు వదిలేయమని అడిగాను

కదా ! చూడండి, ఈ రోజే అసామిని తీసుకొచ్చాను. చౌదరి అండ్ సన్స్‌ని మీకు యెరుగుదురు కదా

వర్మ : వారికి మందుల దుకాణం వుందికదా !

చంపత్రరాయ్ : అవునండి అదే అతను చాలా పెద్దవాడు

వర్మ : అతను పెద్దవాడా? ధనవంతుడా?

చంపతరాయ్ : ఈ రోజుల్లలో మనిషి గొప్పతనము అతని డబ్బు తోటే కొలవాలి. నిన్న పోలిసులు అతనిని పట్టుకున్నారు.

వర్మ : పోలీసు పట్టుకొన్నాడా ?

చంపతరాయ్ : నిన్న పోలీసులు కార్ఖానాకి తాళం వేశారు కొన్ని మందుల నమూనాలను వశం చేసుకున్నారు.

వర్మ : ఏదో హడావిడి చేసివుంటాడు

చంపతరాయ్ : లేదు ఆయన చాలా పెద్ద మనిషి పోలీసులు ఆ నమూనాలను టెస్టు చేయుడానికి పంపారు. లేబరేటరీ ఇన్ చార్జి మీ స్నేహితులు వారు ఇరువది వేలవరకూ ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నారు.

వర్మ : ఆ మందులు మంచివైతే భయపడడము దేనికి ?

చంపతరాయ్ ? వర్మగారూ ! ఈ రోజులలో ధరలు హెచ్చి పోతుంటే ఎంత మంచివాడు మంచి మందులను అమ్మలేడు సిసలైన వస్తువులు అమ్మితే రెండవరోజే దుకాణం మూత పడుతుంది,

వర్మ ; నకిలీ మందులు అమ్మడం ఎంత మహాపాపం!

చం॥ రా॥ : అందుకే ఆయన ప్రాయశ్చిత్తం చేసుకోవాలను కుంటున్నారు.

వర్మ : ఇది మరొక అపరాధం.

చం॥ రా॥ : అవునండి. అందుకనే మేము ఆయనకు 21 వేల రూపాయలు జరిమానా వేస్తున్నాము.

వర్మ : కాని శిక్షించడము కోర్టుపని.

చం॥ రా॥ : వేళాకోళం వదిలేయండి. నిజంగా చెప్పండి. ఈ రొఖ్ఖం తక్కువనిపిస్తే ఇంకా ఎక్కువ ఇస్తారు.

వర్మ : ఇప్పుడు నాకేమీ అక్కర్లేదు. ఇంక నేను అన్యాయం పనులు చేయను. ఇప్పుడు నాకలము ఎవరి గొంతు కొయ్యదు. ఎవరి హక్కు లాక్కోదు. ఏనేరస్థుడ్ని రక్షించదు.

చం॥ రా॥ : మీరు యీ నిర్ణయం ఎప్పట్నుంచి తీసుకున్నారు? ఈ రోజుదాకా అయితే మీరు .... .... ....

వర్మ : ఈ పాపకూపంనుండి మనిషి ఒప్పుడు బయటపడ్డామంచిదే చంపతరాయ్‌గారూ: మీరుకూడా ఈపని మానేయండి.

చం॥ రా॥ : నేనా?

వర్మ ; చెయ్యాలంటే ప్రపంచంలో కావలసినన్ని పనులున్నాయి. ఈ నకిలీ మందులవల్ల ఎంతమంది ప్రాణాలు పోయాయో! మీరు ఎప్పుడయినా ఆలోచించారా? ఎంతమందిని హత్య చేశాయో?

చం॥ రా॥ : ఈ నకిలీ మందులవల్ల ఎవరూ చచ్చిపోరు.

వర్మ : ఏమిటండీ చెబుతారు? పాము కరచినచోట మందుకు బదులు నీళ్ళ యింజక్షన్‌చేస్తే, చస్తాడా? బ్రతుకుతాడా? ఏ రోగికయినా నకిలీమందులిస్తే, వారిరోగం హెచ్చిపోతుంది పాపం ఆ వితంతువుని చూడండి. ఆమె తన పిల్లవాడి మందులకని నగలు తాకట్టుపెట్టి డబ్బు తెచ్చుకుంది. కాని ఆమెకొడుకు నకిలీ మందులకు బలయిపోయాడు. ఆమె గురించి ఎప్పుడయినా ఆలోచించారా? నా యిద్దరుపిల్లలు కూడ యిటువంటి మందులుమ్రింగే చచ్చిపోయారు. నేను తవ్వుకున్న గోతిలో నేనే పడతానని నాకేం తెలుసు? నే వదలినబాణం నా గుండెల్లోనే గ్రుచ్చుకుంటుందని నాకేం తెలుసు?

చం॥ రా॥ : ఆ ధర్మాలు, నీతులు చెప్పుకుందికి వినడానికిబాగుంటాయి. ఇది ప్రపంచం. సాధువులమఠంకాదు ఇది దేవతల బస్తీకాదు. మనుష్యులబస్తీ.

వర్మ : మనము ఈ మనుష్యులబస్తీలో మానవత్వాన్ని వదలిపెట్టకూడదు.

చం॥ రా॥ : బహుశ ఇప్పుడు మీరు మూడ్‌లోలేరు. మళ్ళీ కలుస్తాను. మీరు బాగా ఆలోచించుకోండి. వాడు 10,000 రూ॥ దాకా యిస్తాడు.

వర్మ : వద్దు. (చంపతరాయ్ వెళ్ళిపోతాడు టెలిఫోనుగంటమ్రోగుతుంది)

వర్మ : కాకా ! చూడు ఎవరి ఫోనో.

కాకా : (టెలిఫోను ఎత్తుతాడు.)

వర్మ : ఎవరు ?

కాకా : ఎవరో రామనాథంట.

వర్మ : కలుసుకునేందుకు నాకు కుదరదని చెప్పెసెయ్యి,
(వర్మ కుర్చీలో కూర్చుంటాడు. చంద వెనక్కాలేవచ్చి కళ్లు మూస్తుంది.)

వర్మ : చందా?

చంద : చాల తొందరగా గుర్తుపట్టారే!

వర్మ : చాలాకాలం నుంచి నువ్వు నా కళ్ళు మూసి వుంచావు. ఇవ్వాళ తెరవబడ్డాయి. నేను నిన్ను గుర్తించాను.

చంద : ఓహో డిన్నర్. (వర్మ టై సరిచేస్తుంది)

వర్మ : ఇటు కూర్చో చంద.

చంద : ఏమిటి విషయం? ఓహో? అదాసంగతి. మీ శ్రీమతి గారు ఇంట్లో ఉన్నారుకాబోలు. అయ్యో? మర్చిపోయానే!

వర్మ : ఆమె ఇంట్లోలేదు.

చంద : అయితే విషయమేమిటి?

వర్మ : ఇది మంచిపనికాదు.

చంద : ఏమిటది?

వర్మ : మనం చేసేపనే.

చంద : మనం ఏం చేస్తున్నాం?

వర్మ : చేయరానిపని చేస్తున్నాం.

చంద : హు.

వర్మ : అవును.

చంద : మీరు మాటలు భలేగా మార్చేయగలరే! నిన్నరాత్రి 9 గం॥ వరకు క్లబ్‌లో మీకోసం నిరీక్షించానని తెలుసా?

వర్మ : ఎందుకోసం?

చంద : తెలియదూ! మంచిది. నేను వెళుతున్నాను.

వర్మ : చంద! నీకు కోపమొచ్చిందా?

చంద : నాకు ఇటువంటి పరిహాసం ఇష్టంలేదు.

వర్మ : నేను నిన్ను ఈరోజు కలుసుకునే వాణ్ణి.

చంద : నాకు కూడ మీతోటి చాలా అర్జంటు పనే ఉంది.

వర్మ : చెప్పు?

చంద : టెండరు నెంబరు-8 ఏమయింది ?

వర్మ : దానిరేటు మీకంపెనీ ఎక్కువగా వేసింది.

చంద : మీరే చెప్పారు కదా ! ఈ అయిటంలో ఎక్కువగా కాంప్టీషన్ లేదని.

వర్మ : అదయితే అంతే మరి. కాని నువ్వు 10రూ॥ లు విలువ చేసే వస్తువుకి 40 రూ॥లు "కోట్" చేసావు.

చంద : అయితే ఏమయింది ?

వర్మ : ఇందువల్ల గవర్నమెంటుకి 20000 రూ॥ల విలువగల వస్తువులు 80000 రూ॥లకి లభిస్తాయి. గవర్నమెంటు 60000 రూ॥లు నష్టం వస్తుంది.

చంద : మీకైతే లాభం వస్తుంది కదా !

వర్మ : నేను 5000 రూ॥లు తీసుకొనిగవర్నమెంటుకి 60000రూ॥లు నష్టం చెయ్యనా ?

చంద : అయితే యింకా ఎక్కువ తీసుకోండి.

వర్మ : ఇప్పుడు నాకసలు ఏమీవద్దు. యింతవరకు ఎప్పుడూ మనము గవర్నమెంటు నష్టం మన నష్టమని అనుకోలేదు. గవర్నమెంటుకి ఈ డబ్బంతా ఎక్కడ నుండి వస్తుందో ఎప్పుడైనా ఆలోచించావా ? ప్రభుత్వము వస్తువుల్ని ఎక్కువ ధరపెట్టి కొంటే దాని మీద టాక్స్ ప్రజల మీద ఎక్కువగా వేస్తుంది. ఎక్కువ ధరలు వేస్తే లాభమంతా మీ షాహుకారికి లభిస్తుంది. గవర్నమెంటుకి నష్టం వస్తే లోటు నువ్వు, నేను, ప్రజలు పూర్తి చెయ్యాలి.

చంద : మీకు ఈ విషయం ఇప్పుడు ఇంతకాలానికి తెలిసిందా?

వర్మ : మునుపే తెలిసింది. కాని స్వార్థపు మత్తులో పడి, నేను కూర్చున్న కొమ్మను నేనే కొట్టుకున్నాను. డబ్బు మత్తులో పడి అంతా మర్చిపోయాను. నేను చేసింది ఆలోచించు కుంటే నామనస్సుకి ఎంతో బాధగా ఉంది. నాకు తేలుకుట్టి నట్లు అనిపిస్తోంది. నువ్వు ఈ ఉద్యోగం మానేసై.

చంద : ఉద్యోగం మానడమ ?

వర్మ : అవును చంద. నీకు ఎంత జీత మిస్తారు ?

చంద : ఒక వెయ్యి రూపాయలు.

వర్మ : నీవు ఎప్పుడైనా ఈ జీతం ఎలా వస్తుందో, ఎందుకు యిస్తున్నారో ఆలోచించావా ?

చంద : కంపెనీ పనికోసం యిస్తున్నారు.

వర్మ : ఎలా ఇస్తున్నారు ?

చంద : వాళ్ళ టాక్సులోంచి యిస్తున్నారు.

వర్మ : కాదు. ఈ డబ్బు నీకు, నీ ఆకర్షణకి, సౌందర్యానికి, చిరునవ్వుకి యిస్తున్నారు. ఇంకో ఉద్యోగం వెతుక్కో. ధర్మం గౌరవముస్త్రీత్వము, పోకుండాఉండే మరొక ఉద్యోగము ఏదైనా 1000 రూ॥లు రాకపోయినా ఏదో వెతుక్కో. అదే మంచిది. వెతుకుని గౌరవంగా బ్రతుకు.

చంద : కాని అటువంటి ఉద్యోగము స్త్రీకి ఎక్కడదొరుకుతుంది

వర్మ : అయితే పెళ్ళిచేసుకో చంద !

చంద : అయితే నన్ను వెళ్ళిపొమ్మంటారా ?

వర్మ : అవును. చంద. తిరిగి వెళ్ళిపో. నాయింటి నుండేకాదు, జీవితంలో కుచ్చిత మార్గాల నుంచి తప్పుకో. నీవు రెండో సారి రావాలి. ఈసారి వచ్చేటప్పుడు నీజీవిత భాగస్వామిని తీసికొని రావాలి. నీకు స్వాగతం చెప్పడానికి నాకు సంతోషంగా ఉంటుంది. (వర్మ చందని తలుపు దాకాపంపుతాడు. వచ్చి కూర్చుంటాడు. ఇంతట్లో కాకా వస్తాడు.)

కాకా : మీరు చాలా విచారంగా ఉన్నారు. అలసిపోయారు !

వర్మ : అవును కాకా.

కాకా : అయితే అది పట్టుకురానా ?

వర్మ : ఏమిటది ?

కాకా : అదే దానివల్ల మీద అలసట విచారం పోతాయి

వర్మ : వద్దు కాకా. ఆ బాటిల్సని అవతల పారేయి.

కాకా ; ఏమంటున్నారు ?

వర్మ : అవును 

కాకా : ఇంక మీరు ఎప్పుడూ త్రాగరా ?

వర్మ : త్రాగను కాకా. నీవు వెళ్ళి మందు పట్టుకురా. మందు బెటీ లోపల బల్లమీద ఉంది (కాకా లోపలికి వెడతారు రమ వస్తుంది)



వర్మ : రమ వచ్చావా ?

రమ : అవును

వర్మ : మందిరానికి వెళ్ళావా ?

రమ : లేదు 

వర్మ : నీ గొలుసు పట్టుకెళ్ళావు కదూ

రమ : అవును

వర్మ : నా ప్రియమైన గుర్తుని అమ్మడానికి వెళ్ళావా ?

రమ : ఎందుకంటే మీ ప్రియమైన అసలైన గుర్తుని రక్షించడానికి

వర్మ ; అయితే అమ్మేసి వచ్చావా ?

రమ : లేదు నేను బంగారం దుకాణానికి వెళ్ళాను. అతను షాపులో లేడు, (కాకా వస్తాడు వర్మ అతనికి 10 రూ॥ల నోటు యిస్తాడు)

వర్మ : తీసుకో కాకా, మందు తీసుకునిరా

రమ : ఈ పైసలుతో వైద్యం జరగడానికి వీల్లేదు

వర్మ : ఇవి లంచం పైసలుకాదు. ఇవి నా జీతపు రూపాయలు.

రమ : మీ జీతమని మీరు నిజంగా చెప్పగలరా ? ఈ పైసలు మీరు ధర్మంగా సంపాదించానని చెప్పగలరా ? మునుపటి లాగా అన్యాయంగా సంపాదించినవి కావా ? ఇప్పుడు ఈ పైసలు నాకు పనికిరావు. ఈ పైసలుతోటే నా పిల్ల వాడి ప్రాణం రక్షింపబడదు. ఈ క్షణంలో నేను గొంతో బీదదాన్ని, ఎంతో అసహాయురాలిని. (ఏడుస్తు )

కాకా : (తన జేబులోంచి కొన్ని నోట్లు తీసి రమ కిస్తాడు) ఇవి తీసుకోండి అమ్మగారు: ఇవి నా కష్టార్జితం. ఇందులో ఒక్కొక్క పైస నాపరిశ్రమవల్ల. సేవవల్ల ధర్మంగా సంపాదించిన సొమ్ము. ఈ సొమ్ము తోటి రాజుకి వైద్యం చేయించండి. భగవంతుని దయ ఉంటే రాజు మళ్ళీ నవ్వుతూ, ఆడుతూ ఉంటాడు.

వర్మ : కాకా : ఇంక యీ యింటికి పాపపు సొమ్మురాదు. నీడబ్బు నాకు అప్పుగా యివ్వు నాకష్టార్జితంతో ఈ అప్పు తీరుస్తాను ఇంక న్యాయంగా జీవిస్తాను.

(స మా ప్తం.)

నీవు సరిగా గుఱిపట్టక నన్నుఁ బ్రయోగించినందున నే నర్జును
దెగటార్పఁ జాలనయితిని. కావున మరల జాగ్రత్తతో నన్నుఁ
బ్రయోగింపుము. వజ్రధరుఁడగు నింద్రుఁడు వచ్చి కాపాడినను
విడువకయర్జును వధించెదను." అని పలికెనుగాని కర్ణుఁడందులకు
సమ్మతింపక "కర్ణుఁ డొక బాణమును రెండుమాఱు లుపయో
గించునా? మఱియుఁ గర్ణుఁడు పరులబలము నాధారముగాఁ
జేసికొని యర్జును జయింపఁ గోరునా? పొమ్ము" అనిపలికెను.
కాల మాసన్నమయియుండుటచేఁ గావలయుఁ గర్ణుఁ డర్జునుని
వలె జయార్థులు చేయఁదగినవ్యాపారములను జేయక కేవలము
దనకీర్తి శరీరరక్షణమునకే యత్నించుచు వచ్చెను.*

పయిరీతిని బెద్దయుంబ్రొద్దుమహాద్భుతమగుద్వంద్వయు
ద్ధము జరుపఁబడెను. తుదకుఁ గర్ణునకుఁ గాల మాసన్నమగు

*"తం ప్రేక్ష్య దీప్తం యుధి మాధవస్తు
త్వరాన్విత స్త్వరయైవ లీలయా,
పదాతి నిష్పిష్య రథోత్తమంస
ప్రావేశయ త్పృథివీం కించి దేవ......
సంధీయమానం భుజగం దృష్ట్వా కర్ణేవ మాధవః,
ఆక్రమత్ స్యందనం పద్భ్యాం బలేన బలినాం వరః.
అవగాఢే రథే భూమౌ జానుభ్యా మగమన్ హయాః......
స నాగకర్ణోఽద్య రణే పరస్య బలం సమాస్థాయ జయంబుభూషేత్,
న సందధ్యాం ద్విశ్శరంచైవ నాగయ ద్యర్జునానాం శతమేవహన్యాం."
(భార. కర్ణ. 91. అధ్యాయము.)

ఈవిషయ మాంధ్రభారతమున నగపడదు.

టచేఁ బరశురామభూసురశాపంబులు సఫలంబులు కాఁదొడం గెను. అట్టియెడఁ గర్ణుఁడు, నిత్యసత్యవ్రతుఁడును, ధర్మాత్ముఁ డునునగు తనకట్టియాపద సంభవించుట కాశ్చర్యపడుచు ధర్మ మును దూఱసాగెను.

తే. ధర్మవాదులు ధర్మతత్త్వప్రధాన
చిత్తు లగువారిఁ బూని రక్షించు ధర్మ
మందు రది బొంకు గావించె నతులధర్మ
శీలుఁ డగునన్ను ధర్మవు సెలవు లేదని.

అర్జునువధించెద నని తాను జేసిన ప్రతిజ్ఞను నెఱవేర్పఁజా లుసర్పముఖశరంబును, నింద్రదత్తశక్తియుఁ బయిరీతిని వ్యయ పడుటయుఁ దానర్జునుపయిఁ బ్రయోగించిన బ్రహ్మాస్త్రమునర్జు నుండును దానిచేతనయుపశమింపఁజేయుటయుఁ దనయంత్యకాల మునుసూచించు భార్గవభూసురశాపములు పయిరీతిని దొడరుట యుఁదలఁచి మిక్కిలికోపించి యుడికినమనంబున ధైర్యముచిక్క బట్టి యుత్సాహమును దెచ్చికొని శరలాఘవ మేర్పడ నర్జును వింటినారిని వరుస నెన్నోమాఱులు ఖండించి విజృంభించెను. కర్ణుఁడు నారుల నెన్నిటిం దునిమినను నతివేగమున ధనువు

*"తతః కర్ణః శితై ర్బాణై ర్జ్యాంచిచ్ఛేదసుతే జనైః,
ద్వితీయాం చ తృతీయాం చ చతుర్థీం పంచమీం తథా.
షష్ఠీమథాస్య చిచ్ఛేద సప్తమీం చ తథాష్టమీం,
నవమీం దశమీం చాస్య తథైవైకాదశీం వృషః.
జ్యాశతం శతసంధానః సకర్ణో నావబుధ్యతే."
[భార. కర్ణ. 91. అధ్యాయము.]

సజ్యముగఁ జేసికొనుచు నర్జునుఁడు మాఱేయఁ బోవుచుండెను గాని కర్ణుఁ డల్లెడ లేకుండునట్లుగ నారిని భేదించుచువచ్చెను. తుదకెట్టెటో నారిని దగిలించి మహారోషమున నర్జునుఁడు కర్ణునిపై బాణవర్షమును గురిపించెను. అందులకుఁ గర్ణుఁడు మిగులఁ గోపించి విషము గ్రక్కుచున్న యొకక్రూరమగు నారసమును సంధించి దానిని రౌద్రమంత్రసహితంబు సేసి ప్రయోగింపఁ బోవునప్పు డంతకుముందె క్రొంచెము క్రుంగియున్న రథముచక్రము బొత్తిగాఁ గ్రుంగి బాణప్రయోగము చేయుటకు వీలుపడకుండునట్లుగ రథము ఘూర్ణిల్లెను. సమయము చూచుకొని రథముదిగి కర్ణుఁడు భుజమున నూని రథచక్రమును లేవనెత్తఁగా సప్తద్వీపములు గలభూమియంతయు సముద్రపర్వతాటవులతో నాలుగంగుళములు మీఁదికి లేచి పోయెను గాని రథచక్రమును మాత్రము కఱచిపట్టియే యుండెను.*అట్టియెడఁ గర్ణుఁడు యుద్ధసంరంభముతో నున్నయర్జును వీక్షించి "ఓయీ! అర్జునుఁడా! క్షణమాత్రము యుద్ధము నిలుపుము. దైవవశమున భూగ్రస్తమగునారథచక్రమును భూమినుండి పెల్లగించుటకు రథమును దిగియెదను. నేనును మరలసన్నద్ధుఁడనగువఱకు నీవేయకుండుట యుచితము. యుద్ధధర్మమును వెల్లడించితిని గాని నీకును గృష్ణ

*"తతోఽవతీర్య రాధేయో గథా దాశు సముద్యతః,
చక్రం భుజాభ్యా మాలంబ్య సముత్క్షేప్తు మియేష సః.
సప్తద్వీపా వసుమతీ సశైలవనకాననా,
గీర్ణచక్రా సముత్క్షిప్తా కర్ణేన చతురంగుళమ్."

(భార. కర్ణ. 91 అధ్యాయము.)

నకును వెఱచి యిట్లు పలికినవాఁడను గాను. భూమిపై నుండు నన్ను రథస్థుఁడవై కొట్టుట యనర్థము. కావున నిన్ను క్షణ మాత్రము నిలుమని కోరితిని. ఈపరాభవము నాకు మాతృ గురుప్రభృతులచేఁ జేయఁబడెను గాని నీచేతఁ గాదు. కావున నీవు వృథాభిమానము నొందకుము" అని యిట్లు పలికెను.* అపుడు శ్రీకృష్ణుఁడు "కర్ణుఁడా! నీ కిప్పుడు నీతియు ధర్మమును గావలసివచ్చినవా? పాండవులను లక్క యిండ్లలో దింపి కాల్పిం చునపుడును, ద్రౌపదిని సభలో నావిధముగ భంగపఱచినపు డును, నడవిలో దైన్యముతో నున్న పాండవుల నుడికించుటకై దుర్యోధనునిచే ఘోషయాత్ర చేయించునపుడును, బాలుఁ డగు నభిమన్యు నొక్కరు ననేకులు గలసి వంచనచేసి చంపున పుడును నీ శ్రీరంగనీతు లెట కేఁగినవో తెలియరాకున్నది." అని యిట్లు ఘాటించి యర్జునునకు రోషమును గెరలించి "అర్జునా! సంశయింపక వీనితలఁ దెగవేయుము" అనిపలికెను. కృష్ణునిమా

---

*"భో భో పార్థ మహేష్వాస ముహూర్తం పరిపాలయ,
యావచ్చక్ర మిదం గ్రస్త ముద్ధరామి ధరాతలాత్.
పార్థ కాపురుషాచీర్ణ మభిసంధిం విసర్జయ...
న మాం రథస్థో భూమిష్ఠం వికలం హంతు మర్హసి,
న వాసుదేవా త్త్వత్తో వా పాండవేయ బిభే మ్యహం.
పరాభవో మాతృగురుద్విజేభ్యః
సముద్రపర్యంకధరామహేంద్రైః,
కృతో మమాయం న హి న స్త్వయాకృతో
న తేఽభిమానం భవితా చ నోధ్రువమ్.
(భార. కర్ణ. 91. అధ్యాయము.)

టలచొప్పున యుద్ధమునుండి మరలకయున్న యర్జునునిపైఁ గోపించి కర్ణుఁడు రథస్థుఁడై యమదండమువంటి యొక ఘోరమగు బాణమును బ్రయోగించెను. అద్దానిచే హృదయమున వేధింపఁబడి యర్జునుఁడు మిగుల నొచ్చి రథముపై మూర్ఛిల్లెను. అది సందుచేసికొని కర్ణుఁడు రథమునుండి దిగి చక్రము నెత్తఁ బోయెను గాని యయ్యది లేవకుండెను. అంతలో నర్జునుఁడు తెలివొంది కాలదండమువంటి శాణమును సంధించి సన్నద్ధుఁడై యుండఁగా శ్రీకృష్ణుఁడు "ఓయీ! యర్జునుఁడా! సందేహించెదవేల? ఈదుష్టుఁడు రథారోహణముచేయకముందే యీవాఁడి నారసమున వీనిని వధింపుము" అని పలికెను. అర్జునుఁడును గృష్ణుని వాక్యమును శిరసావహించి యాబాణమును బ్రయోగింపఁగా నక్కర్ణుఁడు దానిచే హతుఁడయ్యెను.*

---

* ఏవముక్త స్తతఃకర్ణో వాసుదేవేన భారత,
క్రోధా త్ప్రస్ఫురమాణోష్ఠో ధనురుద్యమ్య భారత!.
యోధయామాస వై పార్థం మహావేగపరాక్రమః,
తత శ్శరం మహాఘోరం జ్వలంత మివ పావకమ్,
ఆదదే పాండుపుత్రస్య సూతపుత్రో జిఘాంసయా.
ససాయకః కర్ణభుజప్రయుక్తః
శక్రాశనిప్రఖ్యరుచిశ్శితాగ్రః,
భుజాంతరం పార్థస్య ధనంజయస్య
వివేశ వల్మీక మివోరగోత్తమః.
సగాఢ విద్ధ స్సమరే మహాత్మా
విఘూర్ణమానః శ్లథహస్తగాండివః,

చచాల భీభత్సు రమిత్రమర్దనః
క్షితేః ప్రకంపే చ యథాఽచలోత్తమః.
తదంతరం ప్రాప్య వృషోమహారథో
రథాంగ ముర్వీగత ముజ్జిహీర్షుః,
రథాదవప్లుత్య నిగృహ్య దోర్భ్యాం
శశాక దైవాన్న మహాబలోఽపి.
తతః కిరీటీ ప్రతిలభ్యసంజ్ఞాం
జగ్రాహ బాణం యమదండకల్పం,
భయంకరం ప్రాంజలికం మహాత్మా
తతోఽబ్రవీ ద్వాసుదేవోఽపి పార్థం.
ఛింద్యస్య మూర్ధాన మరే శ్శరేణ
నయావదారోహతి వై రథం వృషః,
తథైవ సంపూజ్య సతద్వచః ప్రభోః......
తతోఽర్జున స్తస్య శిరో జహార
వృత్రస్య వజ్రేణ యథామహేంద్రః.

(భారత. కర్ణపర్వ. 92. అధ్యాయము.)

పైవిషయము లాంధ్రభారతమున సరిగా వ్రాయఁబడలేదు. భూమిష్ఠుఁడైనకర్ణు నర్జునుఁడు వధించినట్లు చెప్పలేదు.

# పంద్రెండవప్రకరణము.

---

ఉపసంహారము-హృదయభేదకరమగు పాండవులదుఃఖాతిశయము.

కర్ణుఁ డజయ్యవిక్రముఁ డనియు, దైవదుర్విపాకంబునను నర్జునునకుఁ గల శ్రీకృష్ణభగవానుల సాహాయ్యమునను నాతఁ డర్జునునకు వధ్యుఁ డయ్యె ననియుఁ జెప్పుట సాహసము కాదు. *

---

*"క. భువనము లన్నియు నొక్కటఁ
గవిసియుఁ గర్ణుఁ బరిమార్పఁగా నోపునె భూ
ధవ! భవదీయక్రోధా
గ్నివిహతుఁడై క్రాఁగెఁ గాక నిక్కం బరయన్.

(భార. కర్ణ. 3. ఆ. 387 ప.)

చ. వినుము నరేంద్ర! విప్రుఁ డలిగెన్ జమదగ్నిసుతుండు శాపమి
చ్చె నమరభర్త వంచనము చేసె వరం బని కోరి కుంతి మా
న్చె నలుక భీష్ముఁ డర్ధరథుఁ జేసి యడంచెఁ గలంచె మద్రరా
జనుచితమాడి శౌరి విధియయ్యె నరుం డనిఁ జంపెఁ గర్ణునిన్.

(భార. శాంతి. ఆ. ౨౫. ప.)

క. గురుకర్ణులయస్త్రాగ్నుల
నెరసినయది మున్ను దీని నిటు గాకుండన్
భరపడి రక్షించితి సం
గరము తెగినఁ దొలఁగి యిపుడు గాల విడిచితిన్.

(కర్ణ. ౩. ఆ. ౪౭.)

ఘోరయుద్ధమునందు బంధుమిత్రులను జంపితి మని మనమునఁ బరితపించుచున్న ధర్మరాజాదులకుఁ గౌరవవిజయానంతరమున బంధుల కుదకదానము చేయునపుడు కర్ణుఁడు తనకు జ్యేష్ఠపుత్రుఁ డనియు నాతని కుదకదానము చేయ వలయు ననియుఁ గుంతి తెలియఁజెప్పెను. పిడుగువలె వినఁబడినకఠోరమగు నావృత్తాంతమును విని ధర్మరాజు దుఃఖసముద్రమున మునిఁగి పరిపరివిధములఁ బరితపించుచు నెంద ఱెన్నివిధముల నూరార్చినను నూఱడిల్లక తల్లిం దూఱుచు స్త్రీలకు రహస్యరక్షణసామర్థ్యము లేకుండునట్లు శపించి తాఁజేసిన యకార్యమునకుఁ బశ్చాత్తాపపడి రాజ్యాభిషేకమున కియ్యకొనక వగలంబొగులసాగెను. *

---

*వ. అక్కాలంబున కౌంతేయులు వారు ధర్మంబు దొరంగి గాంగేయద్రోణకర్ణదుర్యోధనాదుల వధించుట యత్తఱిఁ గ్రొత్తయై తోఁచునఁ జిత్తంబుల వగయు లజ్జయు మిగులం బొడమి మొగంబులం దోఁప విన్నవై యున్నం జూచి వెన్నుండు తత్సమీపంబునకుఁ జని వారలతో నిట్లనియె.

సీ. గాంగేయగురుకర్ణకౌరవపతులఁ జ
 క్కటి ననిఁ బరిమార్పఁ గానమైతి
మని మీరు వగవఁ బడ్డార లుగ్రాస్త్ర
 వేదులు ప్రస్ఫుటవిక్రమమున
నదరి వారలఁగెల్వ నరిది గావున నేను
 బహువిధోపాయముల్ పన్ని యిట్లు
తీర్చితిఁ గాక యత్తీవ్రపరాక్రమ
 లలితులఁ బోదురె యట్లు గాక ..."

(శల్య. 7. ఆ. 330-331 ప.)

జ్యేష్ఠభ్రాతయు సత్యసంధుఁడును దల్లిచే నన్యాయముగ నిట్టియాపదలనందినవాఁడును వాత్సల్యమునఁదమ్ములఁ జంపక విడిచినవాఁడును నగుపుణ్యపూరుషుని వైరి యనుకొని వంచనచేసి వధించినపిదప నాతఁడు సోదరుఁ డని తెలిసినపు డెట్టికఠినులకైన హృదయము భేదిల్లకుండునా?

శత్రులను జయించి ధర్మరాజు రాజ్యము ననుభవించె ననుకొనుటయేకాని యేమనుభవించెను? అఖండమగుదుఃఖము ననుభవించెను! భీష్మాదికురువృద్ధులను ద్రోణాదిగురుజనంబులను నభిమన్యుప్రభృతికుమారవర్గమును విరాటద్రుపదాదిబంధుబృందంబును దక్కుంగల మిత్రరాజమండలిని బుత్రనిర్విశేషులగు ప్రజలను దన రాజ్యభోగప్రాప్తికిఁ గదా బలివేసెను. వారిని వీరిని బలివేసె నననేల? రక్తము పంచుకొని పుట్టినసహోదరుఁడగు కర్ణుని బలివేసెను. మఱియుఁ దనతనయులను బలివేసెను. అనుజులను దనుజులను బలివేసి సంపాదించిన రక్తపుఁ గూటికన్న నడవిలోని దుంపధూళియు నుత్కృష్టములుగదా. ఆహా! నాఁడు సంధికాలమున నీతికుశలుఁడును దూరదృష్టియు నగుసంజయుఁడు చెప్పినవాక్యములె వేదవాక్యము లయ్యెను గదా! *

---

*"చ. అఖిలజనక్షయం బయి జయాపజయంబులు రెండునుం దుదిన్
సుఖములు గా నియూపనికిఁ జొప్పడెరె యుత్తము లట్లుగాక యా
నిఖిలసుఖంబు లేమిటికి నీవని వృద్ధజనంబు బాలురన్
సఖులను బంధులన్ గురులఁ జంపితయేని దయాపయోనిధీ!.

(భార. ఉద్యో. 1 ఆ. 296 ప.)

రహస్యభూత మగు కర్ణుని జన్మప్రకారమునుగాని యాతనికి సంభవించిన నీచకులజుఁడను నపయశస్సును గాని వీనులార వినినపు డాసహోదరుల కెట్లు నలుగురలో మొగమెత్తుకొనితిరుగ నగును ! మఱియు నాతఁడు నీచకులజుఁ డని ద్రోణుఁడుబ్రహ్మాస్త్రమునుపదేశింపకుండుటయుఁబరశు రాముఁడుపదేశించిశపించుటయు వినినపుడును, నట్టిచిక్కులలోని కర్ణునిదైన్యమునుభావించినపుడును దత్సహోదరుల గుండియ లెట్లువ్రీలకుండును! కుంతి కోరినప్రకారము తమ్ములనువధింపకుండుటకు వరమునొసంగి యట్లే చేపడినను జంపకవిడిచినయన్న నువైరియనుకొని చేసేతఁ జంపికొనిన యాసోదరులెట్లు జీవింపనోపుదురు ! తమజయమునకై యింద్రుఁ డాతని వంచింపఁగా నొడలొలిచి యాతనికిఁ గవచకుండలములనొసంగిన యాతని ధైర్యౌదార్యములను, సత్యవ్రతమును, దానశీలమును స్మరించినపుడును రాజ్యాభిషేకమును జేయించెదమని కుంతీకృష్ణులు బోధనచేసినను నట్టియనుచితకార్యమునకుఁ జొరక రాజ్యాధిపత్యమును దృణమునకైనఁ దలఁపక విడిచివేసినయాతనిధీరోదాత్తతను నౌచిత్యము

---

క. పాలీక కౌరవులు దు, శ్శీలతఁ జెడఁదలఁచి రేనిఁ జెప్పెద రుధిరా
భీలాన్నంబునకంటెను, మే లగు భిక్షాన్న మైన మానదవడికిన్.
[భార. ఉద్యో. 1. ఆ. 329]

క. తునిఁబోయి క్రూరకర్మా, స్పద మగు తెఱఁగునకుఁజొచ్చిబంధులగురులన్
వెదకి వధియించు సౌఖ్యం,బదియేటికి నార్యనింద్య మస్థిర మగయన్.
(భా. ఉద్యో-1 ఆ. 332.)

ను భావించినపుడును రాజ్యమునకై యెన్నెన్నో యనౌచిత్య ములకొడిగట్టుకొని తుద కట్టిసోదరుం జేసేతం జంపికొన్న యా సహోదరులచిత్తము లెట్లుదీర్ణములు కాకుండును! రాజ్యభోగ ముల మాట యటుండఁగాఁ బాండవులు నిజముగ దుఃఖసము ద్రములో మునిఁగి భూలోకనరకము ననుభవించి బ్రతుకు భారమై కాలముం గడపికొని రని చెప్పవచ్చును.

పాపము! ఎఱిఁగియెఱిఁగి చేసేతఁ దనయుని జంపికొన్న కుంతి కిఁక "దొంగలతల్లి కేడువ సిగ్గు" అనురీతి లోలోనఁ గుళ్లి కుతమారుటకన్న గత్యంతర మేమున్నది?. ఆమె దౌర్గత్యము నే మని చెప్పవచ్చును! తన చిన్ననాఁటిరహస్యవృత్తమా దాఁగ లేదు. కడుపారఁగన్నకొడుకునా చంపికొనెను. తొలుదొల్తఁ దనకన్యాత్వమునకు భంజకమయి వివాహప్రతిబంధక మగునని కర్ణజన్మవిషయకమగు నాదేవరహస్యమును వెల్లడింపదయ్యె.ఆ మీఁద గర్ణుఁడు దుర్యోధనునకుఁ బ్రాణమిత్రుఁ డగుటఁజేసి తనమానమును గోలుపోయి వెల్లడించినను నాతఁడు దుర్యోధ నుని విడుచువాఁడు కాకుండుటచే జ్యేష్ఠుఁడగు కర్ణుఁడు దుర్యో ధనసేవకుఁడై యుండఁ గనిష్ఠులగు ధర్మరాజాదులకును నట్లు సేవకత్వము దుర్లంఘమేయగు ననియు నట్లయినఁదన్నెన్నో బా ములంబెట్టినబావగారి సంతతిపైఁ బగతీఱక పోవుననియుఁ గావలయునట్టి రహస్యమును ధర్మరాజాదులకుఁ దెలుపదయ్యె. ఔరా! "స్త్రీబుద్ధిః ప్రళయాన్తికా" అనుమాట యీవిషయ మున బూటకము కాదనిచెప్పక తప్పదుగదా ! ఈరహస్యము

నెఱిఁగిన శ్రీకృష్ణాదులు వెల్లడింపకుండుటకుఁ బయికారణము లె చాలియున్నవని చెప్పవచ్చును.

పాపమీవిషయమునఁ బాండవకుటుంబమున నెవరి మట్టునకు వారికే లోలోన జీర్ణింపవలసిన యవస్థ ప్రాప్తించినది. కుంతి యెఱిఁగి యెఱిఁగి చేనేతఁ జంపికొనెను. ధర్మరాజు చేపడినను దన్నుఁ జంపక విడిచిన కర్ణుని వధించుటకై యర్జును నెన్నోవిధముల నిష్ఠురములాడి (పేరించి యట్లు చంపించెను. అట్లే భీమనకులసహదేవులును దమ్ముఁజంపక విడిచిన యట్టియ న్నను జంపుమని యర్జునునిఁ (బేరించిరి. అర్జునుఁడును రథస్థుఁడై యుండి యుద్ధమర్యాదను వీడి భూమిష్ఠుఁడైయున్నఁగర్ణునితాను రథ మెక్కువఱకును బాణమేయుట తగదని మొఱపెట్టుచున్న వానిని సన్యాయ్యముగ వధించెను. పైవిషయము నెవ్వరిమః ములలో వారు పశ్చాత్తాపముతో స్మరించుకొనునప్పు డెవ రికి దుఃఖాతిశయమునఁ (బేవులు పెల్లగిలకుండును ! ఆహా దుర్యోధనుఁడు తాను (బదికియుండి పాండవులను సాధించిన కంటె నెక్కుడుగాఁ జచ్చియే సాధించెను. మఱియు వారి గుండెలలోఁ జిచ్చు పెట్టి సదా రగిలించు మహాశత్రు వాఁడె నుగదా!



# శుద్ధపత్రము.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 26 | 10 | యుద్దము | యుద్ధము |
| 27 | 20 | తత్రాపినే | తత్రాపిమే |
| 32 | 13 | ధనుర్భాణ | ధనుర్బాణ |
| 38 | 22 | బెట్టిచిం | బెట్టించి |
| 48 | 1 | యామమష్టుని | యీమమష్టుని |
| 56 | 8 | బరీక్షించు | నిరీక్షించు |
| 57 | 22 | కట్టలేలు | కట్టలేను |
| 59 | 17 | దుర్భేద్య | దుర్భేద |
| 62 | 22 | గాని | గాన |
| 66 | 18 | మా చదువరులు | చదువరులు |
| ,, | 19 | వినఁగలరు | గ్రహింపఁగలరు |
| 68 | 13 | నవలభించె | నవలంబించె |
| 72 | 4 | మర్యాద | మర్యాధ |
| 76 | 14 | గ్రోధధ | గ్రోధకి |
| 89 | 18 | తస | తను |
| 90 | 1 | సన్యాస | సన్న్యాస |
| 92 | 21 | యిచటికి | యచటికి |
| 95 | 21 | సవి | నలిఁ |
| 104 | 17 | వాదినై | వాదినై |
| 114 | 17 | కర్ణేవ | కర్ణేన |
| 115 | 6 | దర్మ | ధర్మ |
| 119 | 11 | ఛింద్య | ఛింధ్య |

ఇందు ముద్రణప్రమాదమునఁ బుత్త్రిశబ్దమును క్షుత్త్రిశబ్దమును నచ్చటచ్చట నేకతకారకములుగాఁ బడినవి. వానినెల్ల ద్వితకారకములుగా నెన్నవలెను.